# నాడీజ్ఞానము

నాడీజ్ఞానప్రకాశికాసహితము

సాంధ్రతాత్పర్యము





శ్రీ పువ్వాడ శ్రీగురునాథరావుగారి అనుమతిని

చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1927

# విషయసూచిక.


| విషయము. | | పుట. |
|---|---|---|
| **నాడ్యుత్పత్తిప్రకరణము.** | | **4** |
| దశవాయువిర్ణయము | ... | 8 |
| గ్రంథాంతర విశేష విషయ నిరూపణము | ... | 9 |
| ఇళాపింగళా నాడీస్వరూపము | ... | 11 |
| **నాడీనిదాన ప్రకరణము.** | | **15** |
| నాడీస్పర్శన విధి | ... | 19 |
| వైద్యకృత్యము | ... | ,, |
| నాడీపరీక్షా నిషేధకాలము | ... | 20 |
| స్త్రీ పురుష నాడీభేదము | ... | ,, |
| జీవసాక్షిణీనాడీకథనము | ... | ,, |
| నాడీ నామములు | ... | 21 |
| నాడీ చిహ్నములు | ... | ,, |
| స్వస్థనాడీ లక్షణము | ... | 22 |
| దోషనాడీ లక్షణము | ... | 23 |
| వాతపిత్తరోగనాడీ లక్షణము | ... | ,, |
| శ్లేష్మరోగనాడీ లక్షణము | ... | ,, |
| వాతపిత్తరోగనాడీ లక్షణము | ... | 24 |
| వాతశ్లేష్మనాడీ లక్షణము | ... | ,, |
| పిత్తశ్లేష్మనాడీ లక్షణము | ... | ,, |
| ప్రకారాంతరవాతశ్లేష్మనాడీ లక్షణము | ... | ,, |
| వాతపిత్తకఫసన్నిపాతనాడీ లక్షణము | ... | ,, |
| అసాధ్యరోగనాడీ లక్షణము | ... | 25 |
| సాధ్యరోగనాడీ లక్షణము | ... | 26 |
| మాసాంతమృత్యునాడీ లక్షణము | ... | ,, |
| ఏడవదిన మృత్యునాడీ లక్షణము | ... | 27 |

| విషయము. | | పుట. |
|---|---|---|
| మూఁడవదిన మృత్యునాడీ లక్షణము | ... | 27 |
| నాలవదివస మృత్యునాడీ లక్షణము | ... | ,, |
| పండ్రెండుజాముల మృత్యునాడీలక్షణము | ... | ,, |
| దినాంతంబున మృత్యునాడీ లక్షణము | ... | 28 |
| జ్వాలావధి మృత్యులక్షణము | ... | ,, |
| ఆరజాములోని మృత్యునాడీలక్షణము | ... | ,, |
| సార్ధప్రహరమృత్యునాడీ లక్షణము | ... | 29 |
| ఆఱవజాము మృత్యునాడీ లక్షణము | ... | ,, |
| తృతీయదివసమృత్యునాడీ లక్షణము | ... | ,, |
| చతుర్థదివస మృత్యునాడీ లక్షణము | ... | ,, |
| పంచమదివస మృత్యునాడీ లక్షణము | ... | 30 |
| అభిఘాతాదిరోగనాడీ లక్షణము | ... | ,, |
| ఘాతాభిషంగజ్వరనాడీ లక్షణము | ... | 31 |
| రోగరహితాపమృత్యు లక్షణము | ... | ,, |
| శోకహిమాది నిశ్చలనాడీ లక్షణము | ... | ,, |
| దుష్టపిత్తనాడీ లక్షణము | ... | ,, |
| సాధ్యనాడీ లక్షణము | ... | 32 |
| ధాతుప్రాప్తనాడీ లక్షణము | ... | ,, |
| సదోషనిర్దోషనాడీ లక్షణము | ... | ,, |
| నూనె, బెల్లము, మినుములు, పాలు, తేనె వీనిని సేవించినవాని నాడీ లక్షణము. | | ,, |
| మధురము, వగరు, పులుసు, ఉష్ణము, చేదు అనుసీపదార్థము లాహారించిన వాని నాడీలక్షణము. | | 33 |
| కారము, ఉప్పు గలపదార్థములు భుజించినవాని నాడీలక్షణము. | | ,, |
| ద్రవపదార్థములు, కఠినద్రవ్యములు భుజించినవాని నాడీలక్షణము. | | ,, |
| పులుసు, మధురామ్లము, అటుకులు, భ్రష్టద్రవ్యములు, భుజించిన వాని నాడీలక్షణము. | | 34 |

| విషయము. | పుట. |
|---|---|
| గుమ్ముడుకాయ, అరఁటికాయ, ఆకుకూరలు మొదలగువానిని భుజించినవాని నాడీలక్షణము. | 34 |
| మాంసము, దుగ్ధము, గుడము, క్షీరము, పిండి మొదలగువానిని భుజించినవాని నాడీలక్షణము. | ,, |
| బెల్లము, అరఁటిపండ్లు, మాంసము, ఉష్ణపదార్థములు, ఎండిన తీక్ష్ణ పదార్థములు మొదలగువానిని భుజించినవాని నాడీలక్షణము. | 35 |
| ప్రాతఃకాలము, మధ్యాహ్నకాలము, సాయంకాలము, రాత్రికాలము వీనియందలి నాడీలక్షణము. | ,, |
| బంధింపఁబడిన నిరోగినాడీలక్షణము ... | ,, |
| జ్వర దాహ సన్నిపాత నాడీలక్షణము ... | 36 |
| జ్వరప్రకోప నాడీలక్షణము ... | ,, |
| జ్వరవాతసంభోగరాత్ర్యుషఃకాల నాడీలక్షణము ... | ,, |
| పిత్తజ్వర, కఠినాహార నాడీలక్షణము ... | ,, |
| మలాజీర్ణ, శ్లేష్మదోష నాడీలక్షణము ... | 37 |
| వాతపిత్త, శ్లేష్మవాత నాడీలక్షణము ... | ,, |
| అల్పశ్లేష్మ, ప్రబలవాత, ఉష్ణవాత నాడీలక్షణము ... | ,, |
| సమాజవాత, తీవ్రవాత నాడీలక్షణము ... | ,, |
| జ్వరప్రకోప, కామ, క్రోధ, వేగ, రోధ, చింతా నాడీలక్షణము. | 38 |
| దుష్టరక్త నాడీలక్షణము ... | ,, |
| భూతజ్వర, ఏకాహికజ్వర, విషమజ్వర నాడీలక్షణము ... | ,, |
| ద్వ్యాహిక, త్ర్యాహిక, చాతుర్థిక జ్వరనాడీలక్షణము ... | ,, |
| క్రోధజ్వర, కామజ్వర నాడీలక్షణము ... | 39 |
| రమణజ్వరము, కామార్తజ్వరము వీటియందు నాడీలక్షణము. | ,, |
| వ్యాయామ, భ్రమణ, చింతా, ధనశోక నాడీలక్షణము ... | ,, |
| అజీర్ణ నాడీలక్షణము ... | ,, |
| పక్వాజీర్ణ, రక్తపూర్ణ, రసయుక్త నాడీలక్షణము ... | ,, |

| విషయము. | పుట. |
|---|---|
| సుఖము ననుభవించెడివాఁడు, ఆఁకలిగొన్నవాఁడు, మందాగ్ని, క్షీణధాతువుగలవాఁడు వీరి నాడీ లక్షణము | 40 |
| ప్రకారాంతర మందాగ్ని నాడీలక్షణము ... | ,, |
| ఆమాశ్రయ, పుష్టివివర్ధన, ఆహారమాంద్య, ఉపవాస నాడీలక్షణము. | ,, |
| దీప్తాగ్నినాడీలక్షణము ... | 41 |
| అగ్నిమాంద్య, గ్రహణీరోగ నాడీలక్షణము ... | ,, |
| మలభేద, గ్రహణీరోగ, అతిసారభేద, విలంబికా, ఆమాతిసార నాడీలక్షణము | ,, |
| మూత్రమల నిరోధ, విద్రధి, విషూచికా నాడీలక్షణము... | 42 |
| ఆనాహ, మూత్రకృచ్ఛ్రనాడీలక్షణము ... | ,, |
| వాతశూల, మరుత్ప్లవ నాడీలక్షణము ... | ,, |
| పైత్య, ఆమశూల నాడీలక్షణము ... | ,, |
| ప్రమేహ, ఆమదూషణ నాడీలక్షణము ... | 43 |
| విషదోష,విష్టంభవాత,గుల్మ,అత్యర్థవాత, అసమాప్తికాలనాడీలక్షణము. | ,, |
| గుల్మ, కంప, పరాక్రమ నాడీలక్షణము ... | ,, |
| వ్రణ, భగంధర నాడీలక్షణము ... | ,, |
| నాంత, శల్యాభిఘాత, వేగావరోధ, వ్యాకులజన నాడీలక్షణము. | ,, |
| నాడీజ్ఞానరహితుఁడు శ్లాఘన కనర్హుఁడనుట ... | 44 |
| గ్రంథానుసంధానదేశకాలప్రకరణ నాడీజ్ఞానము ... | ,, |
| నాడీజ్ఞానప్రాప్తి లక్షణము ... | ,, |
| చంచలాగతి నాడీలక్షణము ... | 47 |
| తేజఃపుంజగతి లక్షణము ... | ,, |
| దుర్బల, క్షీణనాడీలక్షణము ... | 48 |
| ధీరనాడీలక్షణము ... | ,, |

శ్రీమద్ధన్వంతరయే నమః.

యామళాద్యనేకతంత్రములయందుఁగల

# నాడీజ్ఞానప్రకాశిక

ఆంధ్రతాత్పర్యసహితము.

---

శ్లో. యే వై యావద్వికారాః ప్రకృతి వికృతయో యాశ్చ తేషాం జనిత్రీ, యే దేవా శ్చతురాదే రథ సకల మిదం యత్సమూహై ర్విసృష్టం, యత్సంశోభా త్రిమూర్తిః ప్రథిత మిహ యతః పాలనాది స్వసిద్ధా, సామూలాఖ్యాజనేభ్యో వితరతు సుసుఖం ముక్తయేనశ్చ భూయాత్. 1

వాక్యం. ఆద్యం తావన్నాడికావిజ్ఞానాదేవ వాతప్రభృతి జనితానా మామయానాం సాధ్యాసాధ్యసభేదకజ్ఞానం ప్రాప్యతే అతఏవ తన్నిరూప్యత ఇతి.

తా. వైద్యుఁడు ప్రథమంబున వాతపిత్తాది వైషమ్యములచే జనించెడి వ్యాధుల సాధ్యాసాధ్యంబులను, తత్తద్వ్యాధిభేదంబులను నెఱుంగుటకు నాడీజ్ఞానమే మూలకారణముగ నుండును. అట్టి నాడిగతియందు విశేషజ్ఞానము కలిగెనేని రోగస్వరూపంబును దెలిసికొని, తగిన చికిత్స చేయందగు. కావున ఆనాడుల స్వరూపంబులను దెలియం జేసెద.

# నాడ్యుత్పత్తిప్రకరణము

కందమధ్యే స్థితా నాడీ సుషుమ్నేతి ప్రకీర్తితా,
తిష్ఠంతి పరితస్సర్వా శ్చక్రేస్మి న్నాడికా సతః. 2

శరీరమునందలి మూలాధారమునకు మీఁదుగను నాభిస్థానంబునకు మధ్యంబునను కందస్థానంబునందు సుషుమ్న యను నొకనాడి యున్నయది. మఱియుం వచింపంబోయెడి ఇళా పింగళాది నాడు లీసుషుమ్నానాడిని చుట్టుకొని యుండును.

సార్ధత్రికోట్యో నాడ్యోహి స్థూలాస్సూక్ష్మాశ్చ దేహినాం,
నాభికన్ద నిబద్ధాస్తా స్తిర్యగూర్ధ్వ మధస్థితాః. 3

మనుజుల దేహంబున స్థూలసూక్ష్మంబు లగు మూఁడుకోట్ల యేఁబది లక్షలనాడు లున్నయవి. ఆనాడులు మూలాధారంబు నాశ్రయించి, కొన్ని యూర్ధ్వభాగంబునను, కొన్ని యధోభాగంబునను, మఱికొన్ని తిర్యగ్భాగంబునకు వ్యాపించి యున్నయవి.

త్రిస్రఃకోట్యోర్ధకోటీ చ యాని లోమాని మానుషే,
నాడీముఖాని సర్వాణి ఘర్మబిందుం క్షరంతి చ. 4

మఱియు పైనాడుల నాశ్రయించి మూఁడుకోట్ల యేబదిలక్షల రోమంబు లున్నయవి. ఆరోమంబులే నాడులకు ముఖంబు లనంబడు. అందుండియే చెమట స్రవించును.

నానానాడీ ప్రసవగం సర్వభూతాని చాత్మని,
ఊర్ధ్వమూల మధశ్శాఖం వాయుమార్గేణ సర్వగమ్. 5

మనుజుల దేహమందు పైని చెప్పిననాడుల కాధారభూతంబై పరబ్రహ్మ స్వరూపమగు నొకసూక్ష్మవాయువు గలదు; అది ప్రాణాదివాయువులద్వారా దేహమంతటను వ్యాపించు చుండు.

ద్విసప్తతిసహస్రాణి నాడ్యస్సన్తి ర్వాయుగోచరాః,
కర్మమార్గేణ సుషిరా తిర్యంచ సుషిరాత్మికా. 6

ఈ చెప్పఁబడిన నాడులలో డెబ్బదిరెండువేలనాడులు వాయు సంచారయోగ్యంబు లై యుండు; మఱియు ఆనాడులు వాయుమార్గము ద్వారా పునరావృత్తిప్రాపక కర్మరూప ఛిద్రవిశిష్టంబులై తిర్యగ్గతరంధ్ర ప్రధానభూతంబులుగ నుండు.

తర్పయంతి రసై ర్దేహం నద్యస్తోయై రివార్ణవమ్,
ద్వాసప్తతిసహస్రం తు తాసాం స్థూలాః ప్రకీర్తితాః. 7

నదులు నిజజలంబులచే సాగరంబును సమృద్ధిగావించుచందంబున పైనాడులు దేహి సేవించెడి యన్నపానాదుల రసంబుచే దేహంబును వృద్ధిఁ జేయుచున్నయది. అందు వేయిరు డెబ్బది రెండునాడులు స్థూలనాడులుగ నున్నయవి.

దేహే ధమన్యోధన్యాస్తాః పంచేంద్రియగుణావహాః,
నాభికందస్థితా స్తాస్తు నాభౌచక్రే ప్రవేష్టితాః 8

పై నాడులలో శబ్ద స్పర్శ రూప రస గంధాత్మక పంచేంద్రియ గుణగ్రాహకంబు లగునాడులే మిగుల శ్రేష్ఠములుగనుండు. ఆ యైదునాడులు మూలాధారంబు నాశ్రయించి నాభిచక్రంబునం బ్రవేశించి యున్నయవి.

తాసాం చ సూక్ష్మసుషిరాణి శతాని సప్త
స్వచ్ఛాని యైరసకృదన్నరసం వహద్భిః,
ఆప్యాయతే వపు రిదం హి నృణా మమీషా
మప్భస్స్రవద్భి రివ సింధుశతై స్సముద్రమ్. 9

పైనిచెప్పఁబడిన స్థూలనాడులను నాశ్రయించి నిర్మలమైన యేడు నూర్ల ప్రధాననాడులు సూక్ష్మఛిద్రములతోఁ గూడియుండు. ఇవి ప్రతి దినమును మనుజులు భక్షించెడి యన్నపానాదుల రసమును వహింపుచు సముద్రమును నానావిధ నదులు వృద్ధిబొందించు చందంబున శరీరమును వృద్ధిఁ జేయుచున్నయవి.

ఆపాదతః ప్రభృతి గాత్ర మశేషమాసా
మామస్తకా దపిచ నాభిపుర స్థితేన,

ఏత న్మృదంగ ఇవ చర్మచయేన బద్ధం
కాయం నృణా మిహా సిరాశతస ప్తకేన. 10

మూలాధారంబును నాశ్రయించి పాదము మొదలు శిరము పర్యంతము వ్యాపించియుండెడి యేడునూర్లనాడులచే మనుష్యదేహము, మృదంగము చర్మముచే (వారుచే) గట్టంబడి యుండు తెఱంగున, బంధింపంబడి యున్నయది.

ఇళా చ పింగళా చైవ సుషుమ్నా చ సరస్వతీ,
వారుణీ చైవ పూషా చ హస్తిజిహ్వా యశస్వినీ. 11
విశ్వోదరీ కుహూశ్చైవ శంఖినీ చ పయస్వినీ,
అలంబుసా చ గాంధారీ ముఖ్యా శ్చైతా శ్చతుర్దశ. 12

పై నాడులలో ఇళ, పింగళ, సుషుమ్న, సరస్వతి, వారుణి, పూష, హస్తిజిహ్వ, యశస్విని, విశ్వోదరి, కుహు, శంఖిని, పయస్విని, అలంబుస, గాంధారి అను నీ పదునాలుగునాడులు ముఖ్యంబులుగ నుండు.

ఇళా చ పింగళా చైవ సుషుమ్నా చ సరస్వతీ,
గాంధారీ హస్తిజిహ్వా చ కుహూః పూషాయశస్వినీ. 13
వారణాలంబుసా విశ్వా శంఖినీ చ పయస్వినీ,
ఏతాః ప్రాణవహా నాడ్యో జీవకోశే ప్రతిష్ఠితాః. 14

ఇళ, పింగళ, సుషుమ్న, సరస్వతి, గాంధారి, హస్తిజిహ్వ, కుహు, పూష, యశస్విని, వారణ, అలంబుస, విశ్వ, శంఖిని, పయస్విని అను నీ పదునాలుగునాడులు ప్రాణవాహినులై జీవకోశంబునం బ్రతిష్ఠింపంబడి యున్నయవి.

తత్ర ప్రధానా నాడ్యస్తు దశవాయు ప్రవాహికాః,

ఆ పదునాలుగు నాడులలో ఇళానాడిమొదలు వారణానాడి వఱకుఁ గల పదినాడులు, ప్రాణాదివాయువాహినులై యుండుటవలన నవి మిగుల ప్రధానంబులుగ నుండు.

ఇళా పింగళయో శ్చైవ సుషుమ్నా చోర్ధ్వగామినీ. 15
గాంధారీ హస్తిజిహ్వా చ ప్రసార గమనే స్థితా,
అలంబుసా యశస్విన్యౌ దక్షిణాంగే సమన్వితే. 16
కుహూశ్చ శంఖినీ చైవ వామాంగే చావలంబితా,
ఏతాసు దశనాడీషు నానాకార్య ప్రసూతికా. 17

ఇళ, పింగళ, సుషుమ్న అనునీ మూఁడునాడులు శరీరమునం దూర్ధ్వగాములై యుండును. గాంధారి, హస్తిజిహ్వ, అను నీరెండునాడులు చేతులు మొదలగునవి చాచుటకును, ముడుచుటకును నుపయుక్తంబులై యుండును. అలంబుస, యశస్విని అను నీ రెండునాడులు దక్షిణాంగంబుననుండును. కుహు, శంఖిని అను నీ రెండునాడులు వామాంగంబున వ్యాపించియుండును. ఆపదినాడులలో మధ్యమంబున నుండెడి పూష యను ప్రసూతికానాడి సమస్తకార్యంబులను జేయుచుండును.

ఇళా చ వామనాసాయాం దక్షిణే పింగళా మతా,
సుషుమ్నా బ్రహ్మరంధ్రే చ గాన్ధారీ వామచక్షుషి. 18
దక్షిణే హస్తిజిహ్వా చ పూషాకర్ణేఽథ దక్షిణే,
వామే యశస్వినీ జ్ఞేయా ముఖే చాలంబుసా మతా. 19
కుహూ శ్చ లింగమూలేస్యా చ్ఛంఖినీ శిరసోపరి,
ఏవం ద్వారం సమాశ్రిత్య తిష్ఠంతి దశనాడికాః. 20

వామనాసికయందు ఇళయు, దక్షిణనాసికయందు పింగళయు, బ్రహ్మరంధ్రంబున సుషుమ్నయు, వామనేత్రంబున గాంధారియు, దక్షిణనేత్రంబున హస్తిజిహ్వయు, దక్షిణకర్ణంబున పూషయు, వామకర్ణంబున యశస్వినియు, జిహ్వయందు అలంబుసయు, శిశ్నమూలంబున కుహువు, శిరంబుమీఁదిభాగంబున శంఖినియు ఇట్లు పదినాడులును ద్వారంబుల నాశ్రయించి యుండును.

### దశవాయు నిర్ణయము.

ప్రాణోఽపాన స్సమాన శ్చ ఉదానో వ్యాన ఏవచ,
నాగః కూర్మోఽథ కృకరో దేవదత్తో ధనంజయః. 21
ఏతే నాడీషు సర్వాసు చరంతి దశవాయవః,
ఏతేషు వాయవః పంచ ముఖ్యాః ప్రాణాదయ స్మృతాః.
తేషు ముఖ్యతమా వేతౌ ప్రాణాపానౌ నరోత్తమే,
ప్రాణ ఏవై తయోర్ముఖ్య స్సర్వప్రాణభృతాం సదా. 23

ప్రాణము, అపానము, సమానము, ఉదానము, వ్యానము, నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయము అను నీపదివాయువులు సర్వనాడులయందును సంచరించుచుండును. ఈ పదివాయువులలో ప్రాణాది పంచవాయువులు ముఖ్యంబులుగను, అందు ప్రాణాపానంబులు మిగుల ముఖ్యంబులుగను, వానిలో ప్రాణ మత్యంత ముఖ్యంబుగను నుండును.

శబ్దగ్రహా శ్రుతౌ నాడీ రూపం గృహ్ణాతి లోచనే,
గంధగ్రహా నాసికాయాం రసనాయాం రసావహా. 24
ఏవం త్వచు స్పర్శవహా శబకృద్ధృదయాన్ముఖే,
మనోబుద్ధ్యాదికం సర్వం హృదయేషు ప్రతిష్ఠితమ్. 25
పురీతత్యాం మనస్థిత్యా నిద్రా సమభిజాయతే.

కర్ణంబులయందు వ్యాపించియుండు నాడులు శబ్దగ్రాహకంబులుగను, నయనంబులయందుండునవి రూపగ్రాహకంబులుగను, నాసికయందుండునవి గంధగ్రాహకములుగను, జిహ్వయందుండునవి రసగ్రాహకముగను, చర్మమునం దుండునవి స్పర్శగ్రాహకముగను, హృదయమునందును ముఖమునందు నుండునవి శబ్దోచ్చారణమునకును ఉపయుక్తముగ నుండును.

మనస్సు, బుద్ధి, ఇవి హృదయంబున బ్రతిష్ఠింపంబడియున్నవి. పురీతతియను నాడియందు మనస్సు లీనంబయ్యెనేని యప్పుడు నరునికి నిద్రకల్గును.

## ——● గ్రంథాంతర విశేష విషయ నిరూపణము. ●——

వాక్యం. అన్యాసాం నామా న్యపి శారదాయాం.

పైఁ జెప్పఁబడిన పదునాలుగు నాడీ నామములుగాక నితర నాడుల నామంబులు శారదయను గ్రంథమునందుఁ జెప్పఁబడి యున్నయది.

గాంధారీ హస్తిజిహ్వాఖ్యా సపూషాలంబుసా మతా,
యశస్వినీ శంఖినీ చ కుహూ స్స్యు స్సప్తనాడికాః. 26
వాక్యం. తాసాం స్థితిస్వరూపం యోగార్ణవే.

గాంధారి, హస్తిజిహ్వా, పూష, అలంబుస, యశస్విని, శంఖిని, కుహూ అను నామంబులుగల యేడునాడులస్వరూపంబులును, స్థితియును యోగార్ణవమను గ్రంథంబునఁ జెప్పంబడి యున్నయది.

ఇళా పృష్ఠేతు గాంధారీ మయూరగళ సన్నిభా,
సవ్యపాదాదినేత్రాంతా గాన్ధారి పరికీర్తితా. 27

గాంధారి యను నాడి మయూరకంఠవర్ణము గలదియై, ఇళయను నాడికి పృష్ఠము నాశ్రయించి, సవ్యపాదము మొదలు నేత్రాంతమువఱకు వ్యాపించియుండు.

హస్తిజిహ్వోత్పలప్రఖ్యా నాడీకా స్యాః పురస్థితా,
సవ్యభాగస్య మూర్ధాది పాదాంగుష్ఠాంకమాశ్రితా. 28

హస్తిజిహ్వా యను నాడి నల్లకలువ వర్ణము గలదియై, ఇళయను నాడికి ముందుభాగము నాశ్రయించి, సవ్యభాగమున శిరస్సు మొదలు పాదాంగుష్ఠమువఱకు వ్యాపించి యుండును.

పూషాతు పింగళా పృష్ఠే నీలజీమూత సన్నిభా,
యామ్యభాగస్య నేత్రాంతా యావ త్పాదతలం గతా.

పూష యను నాడి నల్లనిమేఘచ్ఛాయ గలదియై, పింగళ యను నాడికి పృష్ఠభాగమునుండి దక్షిణభాగమున పాదాంగుష్ఠము మొదలు కొని, నేత్రాంతమువఱకు వ్యాపించి యుండు.

అలంబుసా రక్తవర్ణా నాడీ తస్యాః పురస్స్థితా,
పాదాంగుష్ఠాంత మారభ్య నేత్రాంతం దక్షిణే శ్రితా 30

అలంబుస యనునాడి రక్తవర్ణము గలదియై, పింగళ యను నాడికి ముందుభాగము నాశ్రయించుకొని, కుడిపాదాంగుష్ఠము మొదలు నేత్రాంతమువఱకు వ్యాపించి యుండు.

యశస్వినీ శంఖవర్ణా పింగళా పూర్వదేశగా,
పాదాంగుష్ఠాంత మారభ్య దక్షమూర్ధాంత మాశ్రితా.

యశస్విని యను నాడి శంఖవర్ణము గలదియై, పింగళ యనునాడికి పూర్వభాగము నాశ్రయించుకొని, దక్షిణభాగమునందు పాదాంగుష్ఠాంతము మొదలు శిరంబువఱకు వ్యాపించి యుండు.

గాంధార్యాశ్చ సరస్వత్యా మధ్యస్థా శంఖినీ మతా,
సువర్ణవర్ణా పాదాది కర్ణాంతా సవ్యభాగకే. 32

శంఖిని యను నాడి స్వర్ణవర్ణముగలదియై, గాంధారి, సరస్వతి యను నాడులకు మధ్యము నాశ్రయించి, సవ్యపాదము మొదలు కర్ణాంతము వఱకు వ్యాపించి యుండు.

కుహూః ప్రోక్తా శ్వేతవర్ణా వారుణీ పూష మధ్యగా,
పాదాంగుష్ఠాదిమూర్ధాంతా యామ్యభాగే కుహూర్మతా.

కుహూ యనునాడి శ్వేతవర్ణముగలదియై, వారుణి, పూష యను నాడులు మధ్యము నాశ్రయించుకొని, యామ్య పాదాంగుష్ఠము మొదలు శిరస్సువఱకు వ్యాపించి యుండు.

విశ్వోదరీ శంఖినీచ రావనా చ సరస్వతీ,
ఏతా శ్చతుర్నాడ్యఉక్తాః ప్రధానత్వేన పండితైః. 34

విశ్వోదరి, శంఖిని, రావనా, సరస్వతి యను నాలుగు నాడులును ప్రధానంబు లని పండితులచేఁ జెప్పంబడి యున్నయవి.

ముక్తిమార్గే సుషుమ్నా సా బ్రహ్మరంధ్రేతి కీర్తితా,
అవ్యక్తా సాచ విజ్ఞేయా సుషుమ్నా వైష్ణవీ స్థితా. 35

సుషుమ్న యను నాడి ముక్తిమార్గమునం దుండుటచే బ్రహ్మరంధ్రం బనిచెప్పంబడును. ఆనాడి విష్ణుదేవతాకమై అవ్యక్తముగ నుండు.

తాసాం తిస్రః ప్రధానాస్తు తిసృష్వేకోత్తమా మతా,
ఇళాచ పింగళా చైవ సుషుమ్నా చ తృతీయకా. 36

పైని చెప్పంబడిన పదినాడులలో ఇళ, పింగళ, సుషుమ్న అను మూఁడు నాడులును ప్రధానంబులుగ నున్నయవి. వానిలో సుషుమ్న యను నాడి ఉత్తమోత్తమముగ నుండును.

తత్రైకా వామతో యాతి ద్వితీయా దక్షిణే తథా,
మధ్యే వాయుపథం విద్యాత్ త్రిభి స్తుల్యం గతాగతమ్. 37

ఇళ యనునాడి యెడమపార్శ్వమునందును, పింగళ యనునాడి కుడి పార్శ్వము నందును, సుషుమ్న యనునాడి యీనాడులకు మధ్యంబునను నుండుటయగాక, నిమ్మూఁడు నాడులయందును తుల్యముగ సంచరించెడి వాయుమార్గము గలిగియుండును.

## ఇళాపింగళానాడీస్వరూపము.

ఇళాచ శంఖచంద్రాభా తస్యా వామే వ్యవస్థితాః,
పింగళా సితరక్తాభా దక్షిణం పార్శ్వ మాశ్రితాః. 38

ఇళ ~~పింగళ~~ యనునాడి శంఖమువలెను, చంద్రునివలెను ప్రకాశించుచు సుషుమ్న యనునాడికి వామభాగమునం దుండును. పింగళ యనునాడి నలుపు ఎఱుపుగల మిశ్రవర్ణముగలదియై ప్రకాశించుచు సుషుమ్నానాడికి దక్షిణభాగము నాశ్రయించియుండు.

చంద్రసూర్యాగ్నయో మరుచ్చైవ త్రయస్తిస్రృష్వవస్థితా,
తథా రజస్తమస్సత్త్వం రాత్ర్యహః కాల ఏవచ. 39

ఇళ యనునాడి చంద్రదేవతాకమై రజోగుణ ప్రధానమై యుండుటయగాక, రాత్రిరూప ఖండకాలయుక్తముగ నుండును. పింగళయనునాడి సూర్యదేవతాకమై తమోగుణప్రధానమై యుండుటయగాక, అహః కాల స్వరూప ఖండకాలయుక్తముగ నుండును. సుషుమ్న యనునాడి వాయుదేవతాకమై సత్త్వగుణప్రధానమై యుండుటయగాక అఖండకాలయుక్తమైయుండును.

ఇళా దోషమయీ ప్రోక్తా పింగళా వహ్నిరూపిణీ,
వాయ్వాగ్నేయీ సుషుమ్నా చ బ్రహ్మద్వారపథానుగా.

దోషరూప మగు ఇళయను నాడియు, తేజోరూప మగుపింగళయను నాడియు, వాయ్వగ్నిరూప మగుసుషుమ్న యను నాడియు, బ్రహ్మద్వారము నాశ్రయించుకొని యుండును.

పద్మకోశ ప్రతీకాశం సుషిరైశ్చ విభూషితమ్,
హృదయం తద్విజానీయా ద్విశ్వస్యాయతనం హి తత్. 41

తామరమొగ్గవలె అగ్రమునందు రంధ్రములుగలిగి అధోముఖంబయి నాభికూర్ధ్వంబుగ నుండెడి హృత్పుండరీకము బ్రహ్మకు నివాసస్థానంబుగ నున్నయది.

దక్షిణా పింగళానాడీ వహ్నిమండల గోచరా,
దేవయాన మితి జ్ఞేయా పుణ్యకర్మానుసారిణీ. 42

యజ్ఞాది పుణ్యకర్మములు జేసినవారిని, పింగళ యనునాడి మూలాధారమునుండి వెడలి హృత్పుండరీక దక్షిణభాగముగ శిరంబున నుండెడి సహస్రార మనుచక్రము నాధారముచేసికొని వహ్నిమండలమువఱకు వ్యాపించి అర్చిరాది మార్గముగ దేవలోకముఁ జెందునటులఁ జేయును.

ఇళాచ వామనిశ్వాసా సోమమండల గోచరా,
పితృయాన మితిజ్ఞేయా వామమాశ్రిత్య తిష్ఠతి. 43

పితృలోక ప్రాప్తిహేతుభూత మగు సత్కర్మములు చేసినవారిని ఇళ యను నాడి మూలాధారమునుండి వెడలి హృత్పుండరీకవామభాగముగ శిరంబున నుండెడి సహస్రారచక్రము నాధారము చేసికొని చంద్రమండలము వఱకు వ్యాపించి ధూమాదిమార్గముగ పితృలోకమును జెందునటులం జేయును. ఈ యిళాపింగళ యనునాడులే ఉచ్ఛ్వాసనిశ్వాసముల కాధారభూతంబులై యున్నయవి.

గుదస్య పృష్ఠభాగేఽస్మిన్ వీణాదండస్య దేహభృత్,
దీర్ఘాస్థి మూర్ధపర్యంతం బ్రహ్మదణ్డేతి కథ్యతే. 44

గుదస్థానము మొదలు శిరస్సువఱకు వ్యాపించి, వీణాదండాకారంబుగ నుండెడి యస్థి బ్రహ్మలోక ప్రాప్తికి హేతుభూత మగు సుషుమ్నా నాడికాధారమగుటచే బ్రహ్మదండ మనఁబడును.

తస్యాంతే సుషిరం సూక్ష్మం బ్రహ్మనాడీతి సూరిభిః,
ఇళాపింగళయో ర్మధ్యే సుషుమ్నా సూక్ష్మరూపిణీ. 45

బ్రహ్మలోకప్రాప్తిహేతుభూత మగు దహరాద్యుపాసన జేసినవారికి, సూక్ష్మరూపి యగు సుషుమ్నా నాడి మూలాధారమునుండి ఇళాపింగళ మధ్యమునందు వెడలి, సూక్ష్మరూపమై వీణాదండాకారంబుగ నుండెడి వెన్నెముక ద్వారమునందుఁ జొచ్చి సహస్రారచక్రమును బ్రహ్మరంధ్రమూలముగ సూర్యమండలమువఱకు వ్యాపించి బ్రహ్మలోకమును గలుగంజేయును.

సర్వం ప్రతిష్ఠితం యస్మిన్ బహుమార్గ సర్వతోముఖమ్,
తస్యా మధ్యగతా స్సూర్య సోమాగ్ని పరమేశ్వరాః. 46
భూతా లోకా దిశః క్షేత్రం సముద్రాః పర్వతా శ్శిలాః,

ద్వీపాశ్చ నిమ్నగా వేదా శ్శాస్త్రవిద్యా కులాక్షరాః. 47
స్వర మంత్ర పురాణాని గుణాశ్చైతాని సర్వగః,
బీజజీవాత్మక స్తేషాం క్షేత్రజ్ఞాః ప్రాణవాయవః.
సుషుమ్నాంతర్గతం విశ్వం తస్మిౕ సర్వం ప్రతిష్ఠితమ్.

సర్వప్రపంచాత్మక పరంజ్యోతి స్వరూపియగు బ్రహ్మను, ఈసుషుమ్నానాడియందే నివసించుచుండును. మఱియు నీనాడి నానామార్గములు గలిగి, బహుముఖంబులతో వ్యాపించును. ఈనాడియే శుద్ధబ్రహ్మమునకు రూపాంతరములుగ నుండెడి సూర్యచంద్రాగ్ని పరమేశ్వరులకును, పృథివ్యాది పంచభూతంబులకును, చతుర్దశ భువనంబులకును, ప్రాగాది దశదిక్కులకును, కాశ్యాది ధర్మక్షేత్రములకును, లవణాది సప్తసముద్రములకును, మేర్వాది పర్వతములకును, రత్నాది శిలలకును, సప్తద్వీపములకును, గంగాదినదులకును, వేదములకును, మీమాంసాది సకల శాస్త్రములకును, చతుష్షష్టి విద్యలకును, బ్రాహ్మణాది జాతులకును, అకారాది వర్ణములకును, ఉదాత్తాది స్వరములకును, సప్తకోటి మహామంత్రములకును, బ్రాహ్మాది పురాణములకును, సత్త్వరజస్తమోగుణములకును, మహదాది చతుర్వింశతి తత్త్వములకును, జీవునికిని, క్షేత్రజ్ఞునికిని, ప్రాణాది పంచవాయువులకును, నాగాద్యుపవాయువులకును సమస్త ప్రపంచమునకును, నాధారంబుగ నున్నయది.

నాద్యుత్పత్తిప్రకరణము ముగిసెను.

శ్రీ ర స్తు

శ్రీమద్ధన్వంతరయే నమః

# నాడీజ్ఞానము

ఆంధ్ర తాత్పర్య సహితము.

---

## నాడీనిదాన ప్రకరణము.

శ్లో. క్వచి చ్చక్రంచ కోశశ్చ క్వచి జ్జీవగృహం స్థితమ్,
అస్మింశ్చ క్షేత్రే స్థితో జీవః పుణ్యాపుణ్యప్రవేశితః. 1

కొన్నిస్థలములయందు నాభ్యాది చక్రాకారముగను, కొన్నిస్థలములయం దామాశయాది కోశాకారములుగను, కొన్ని స్థలములయందు హృదయాది జీవగృహములుగను నుండెడి యీశరీరమునందు జీవుఁడు పుణ్యాపాపగతి విశేషమువలన వసించుచుండును.

ప్రాణాని సమమారూఢో దేహే భ్రమతి సర్వదా,
తంతుపంజరమధ్యస్థా యథా భ్రమతి లూతికా. 2

సాలెపురుగు తంతుపంజరమధ్యభాగమునం దెడతెగక సంచరించెడి చందంబున నీజీవుఁడు శరీరమునందు పంచప్రాణాదులతోడ నెడతెగక సంచరించుచుండును.

య స్తమభ్యసతే నిత్యం తద్గతే నాంతరాత్మనా,
న తస్య జాయతే మృత్యు రితి సర్వాగమోదితమ్. 3

ఎవఁడు పైనిచెప్పిన జీవుని, యోగాభ్యాసముచే పరబ్రహ్మాధ్యానము చేయుచుండునో, అట్టివాఁడు పూర్ణాయుష్మంతుఁడుగ నుండును.

నాభి రోజో గుదం శుక్రం శోణితం శంఖకౌ తథా,
మూర్ధాంస కాండహృదయం ప్రాణస్యాయతనం దశ. 4

నాభి, ధాతువు, గుదము, వీర్యము, రక్తము, కణతలు, శిరము, భుజములసంధి, హృదయము, ఈపదియుఁ ప్రాణవాయువున కునికిపట్టుగ నుండును.

త్రింశ ద్ధస్తప్రమాణాతు విశ్వోదరీ ద్వయాధికా,
ఏకహస్తప్రమాణాస్యా త్కంఠదేశస్య నాడికా. 5

ముప్పదిరెండు మూరలుగల విశ్వోదరి యనునాడి యుందరంబున నున్న యది. అందొకమూర కంఠస్థానము నాశ్రయించి యుండును.

దశహస్తా తతః పశ్చా దామాశయ ప్రకీర్తితా,
పచ్యమానాశయా జ్ఞేయా దశహస్తా తతః పరమ్. 6
పక్వాశయా తతః పశ్చా ద్దశహస్తా ప్రకీర్తితా,
ఏకహస్తాం గుహ్యదేశే శంఖావర్తాతు నాడికా. 7

కంఠము నాశ్రయించియుండెడి పైనాడికి దిగువ పదిమూరలలో ఆమాశయంబును, దానికి పదిమూరలలో పచ్యమానాశయంబును, దానికి పదిమూరలలో పక్వాశయంబును నున్నయది. తక్కిన నొకమూర శంఖావర్త మైగుదస్థానమున నుండును.

భుక్త మామాశయే తిష్ఠే త్పచ్యమానాశయే పచేత్,
పక్వం పక్వాశయే తిష్ఠే ద్వహ్నిః పక్వాశయోపరి. 8
పచ్యమానాశయే పక్వం మలం పక్వాశయే వ్రజేత్,

మనుజులు భక్షించెడి యాహారము మొదట ఆమాశయము నందుఁ బ్రవేశించి, యందుండి పచ్యమానాశయమునందుఁ జేరి, దానికి దిగువ నుండెడి జఠరాగ్నిచే పక్వమై, అందలి పిప్పి పక్వాశయమునందుఁ జేరును.

రసో భోజ్యాదికానాం చ నాభినాడ్యా కళేబరమ్. 9
సకలం యాతి మరుతా నీయమాన స్స్వమాశ్రయాత్,

పచ్యమానాశయములో పక్వంబైన భక్షిత ద్రవ్యసారము, నాభి నాళమునందుఁ బ్రవేశించి, వాయుప్రేరితమై సమస్తనాడుల ద్వారముగ శరీరమున వ్యాపించుచున్నయది.

నాభిస్తు కూర్మరూపస్యా న్మహానాడ్యష్టపా ద్భవేత్. 10
చతస్రః పృష్ఠదేశే స్యు శ్చతస్రః క్రోడదేశగాః,

కూర్మాకారం బగునాభి మహానాడులనెడి ఎనిమిదిపాదంబులతోఁ డంగూడియుండు. అయ్యెనిమిది నాడులలో నాలుగు పృష్ఠదేశంబును, నాలుగు వక్షఃస్థలంబును నాశ్రయించి యున్నయవి.

ద్వే ద్వే ఊర్ధ్వ మధశ్చాపి నాడికే అంతగామినీ 11
ఊర్ధ్వగా గళదేశేతు పల్లవౌ ద్వౌ ప్రకీర్తితౌః,
తదేకా గళతః పంచ పల్లవా నాడికా స్మృతా. 12

ఆకూర్మాకారం బగు నాభి పృష్ఠదేశంబును నాశ్రయించియుండెడు పైనాలుగునాడులు, శరీరోర్ధ్వభాగంబుగ వెడలి శిరంబువఱకును, వక్షఃస్థలము నాశ్రయించియుండెడి నాలుగునాడులు పాదాంతమువఱకును వ్యాపించియుండును. మఱియు, ఊర్ధ్వంబుగ వెడలిన నాలుగు నాడులు రెండు రెండుగఁ జీలి యెనిమిదిగ పరిణమిల్లి యం దొకటి అయిదు నాడులుగ విలసిల్లును.

చక్షుషో ర్నాసికారంధ్రే జిహ్వాయాం శ్రవణాఽధరే,
ఆకుంచనకరీ ఖ్యాతా ఏవం పృష్ఠా త్ప్రసారిణీ. 13

ఐదుగ పరిణమిల్లినట్టు పైని చెప్పఁబడిన నాడులలో రెండు నేత్రములయందును, రెండు నాసికారంధ్రంబులయందును, ఒకటి జిహ్వాయందును వ్యాపించియున్నవి. తక్కిన రెండునాడులు శ్రవణములయందును, రెండునాడులు ఊర్ధ్వాధరోష్ఠంబులయందును వ్యాపించియుండును. ఈప్రకారమే, మఱియొకనాడి పైకివెడలిన తొమ్మిదినాడులకును సహాయంబుగనుండి మూయుట, తెరుచుట, మొదలగు కార్యంబులను జేయును.

తదేకా స్కంధదేశాత్తు హస్తగా పంచపల్లవా,
అంగులీ క్రోడగా సైవ ఆకుంచనకరీ స్మృతా. 14
ఏవం పృష్ఠా త్సమాగత్య ప్రసారమకరీస్మృతా,

శిరంబున వ్యాపించినట్లు, పైనిచెప్పిన నాడులుగాక, రెండునాడులు హస్తములయందు వ్యాపించి, అయిదైదుశాఖలుగజీలి, వేళ్లయందుఁజొచ్చి, చేతులు చాచుట, ముడుచుట, మొదలగు కృత్యంబులను జేయుచుండును.

అధోగా ఊరుసంధ్యంత శ్చాడికాః పంచపల్లవాః. 15
పాదాంగుళగతా సైవ ఆకుంచనకరీ స్మృతా,
ఏవం పృష్ఠా త్సమాగత్య ప్రసారణకరీ స్మృతా. 16

కూర్మాకారంబగు నాభియొక్క వక్షఃస్థలంబు నాశ్రయించినట్లు పైనిచెప్పఁబడిన నాలుగునాడులలో, రెండునాడులు కటిప్రదేశమున జేరి, ఊరుసంధులమూలముగ పూర్వభాగముగ పాదాంతములవఱకు వ్యాపించి, పంచపల్లవములు గలవియై, అంగుళమునందు జొచ్చి, ముడుచునటులం జేయును. మఱియు, నితర రెండు నాడులు, వెనకటి ఊరుసంధులద్వారా పాదాంతములవఱకు వ్యాపించి, చాచునటులం జేయుచున్నయవి.

కూర్మస్య నవమః పాదో లింగనాడీతి కీర్త్యతే,
మూత్ర శుక్రవహా నాడ్యా తస్యాః పల్లవతః పునః. 17

ఆకూర్మమునందే తొమ్మిదవదియగు మఱియొకలింగనాడి యుద్భవిల్లి మేఢ్రమునందు వ్యాపించి, యందు రెండుదళంబులై, యందొకటి మూత్రంబును, మఱియొకటి శుక్లంబును, వెడలునటులం జేయును.

తిర్య క్కూర్మో దేహినాం నాభిదేశే
వామే వక్త్రం తస్య పుచ్ఛం చ యామ్యే,
ఊర్ధ్వభాగే హస్తపాదౌ చ వామా
తస్యాధస్తా ద్దక్షిణౌ సంస్థితౌ తౌ. 18

పైనాభికూర్మము మనుజుల నాభిస్థానమునం దెడమపార్శ్వమున ముఖమును, కుడిపార్శ్వమున పుచ్ఛమును గలదియై యుండుటయు గాక, ఊర్ధ్వముఖంబు లగువామహస్తపాదములు గలదిగను, అధోముఖంబు లగు దక్షిణహస్త పాదములు గలదిగను నున్నయది.

వక్త్రే నాడీద్వయం తస్య పుచ్ఛే నాడీద్వయం తథా,
పంచపంచకరేపాదే వామదక్షిణభాగయోః. 19

మఱియు, ఆకూర్మముఖమునందు రెండునాడులును, పుచ్ఛమునందు రెండునాడులును, దక్షిణహస్తమునం దైదునాడులును, దక్షిణపాదమునం దైదునాడులును, వామహస్తమునం దైదునాడులును, వామపాదమునం దైదునాడులును నున్నయవి.

### నాడీస్పర్శన విధి.

సవ్యేన రోగ ధృతి కూర్పరభాగ మధ్యం
పీడ్యాథ దక్షిణకరాంగుళికా త్రయేణ,
అంగుష్ఠమూల మధి పశ్చిమభాగమధ్యే
నాడీం ప్రభంజనగతిం సతతం పరీక్షేత్. 20

వైద్యుఁడు, రోగియొక్క దక్షిణహస్తమును మోచెయ్యి మొదలుకొని తన వామహస్తముచేఁ జక్కఁగ పిసికి, ఆహస్తమునందలి అంగుష్ఠమూలమునందు లోభాగమధ్యమున తన వామాంగుళిత్రయములచే సదా వాతగతిని బరీక్షించి, రోగనిదానంబు నెఱుంగవలయును.

### వైద్యకృత్యము.

ప్రాతః కృతసమాచారః కృతాచార పరిగ్రహమ్,
సుఖాసీన స్సుఖాసీనం పరీక్షార్థ ముపాచరేత్. 21

వైద్యుఁడు ప్రాతఃకాలమునందు స్నానసంధ్యావందనాది క్రియల నొనర్చుకొని, పరిశుద్ధుఁడై, సుఖాసీనుం డగు రోగికడ కేతెంచి, తాను సుఖాసీనుండై, రోగనిదానంబు నెఱుంగవలయును.

### నాడీపరీక్షానిషేధకాలము.

తైలాభ్యంగే చ సుప్తే చ తథా వై భోజనాన్తరే,
తదా నజ్ఞాయతే నాడీ యథా దుర్గతరా నదీ. 22

తైలాభ్యంజనము గావించినవానికిని, నిదురబోయి మేల్కొనిన వానికిని, భోజనము జేసినవానికిని, వేగముగఁ బ్రవహించెడి నదిచందంబున నాడి, అతివేగంబుగ నడుచుచుండును గాన, నట్టికాలంబున నాడిని బరీక్షింపఁగూడదు.

### స్త్రీ పురుష నాడీభేదము.

వామభాగే స్త్రియా యోజ్యా నాడీ పుంసస్తు దక్షిణే,
ఇతిప్రోక్తం మయా దేవి సర్వదేహేషు దేహినామ్. 23

స్త్రీలకు వామహస్తమునందును, పురుషులకు దక్షిణహస్తమునందును, నాడిని పరీక్షింపవలయు నని పార్వతితో పరమేశ్వరుండు వచించెను.

స్త్రీణా మూర్ధ్వముఖః కూర్మః పుంసాం పున రధోముఖః,
అతః కూర్మ వ్యతిక్రాంతా త్సర్వత్రైవ వ్యతిక్రమ. 24
లక్ష్యతే దక్షిణే పుంసాం యాచనాడీ విచక్షణైః,
కూర్మభేదేన వామానాం వామేచైవావలోక్యతే. 25

పైనిచెప్పిన నాభికూర్మము స్త్రీల కూర్ధ్వముఖంబుగను, పురుషుల కధోముఖంబుగను నుండుటచే, స్త్రీపురుషులకు నాడులును వ్యత్యస్తముగ నుండుగాన స్త్రీలకు వామహస్తమునందును, పురుషులకు దక్షిణహస్తమునందును నాడిని బరీక్షింపవలయుం. మఱియుం నపుంసకుఁడుగనుండెనేని అట్టివాని స్త్రీపురుష రూపభేదంబులనెఱింగి వామ దక్షిణ క్రమంబుగ నాడిని బరీక్షింపవలయుం.

### జీవసాక్షిణీ నాడీకథనము.

అంగుష్ఠస్య తు మూలేయా సా నాడీ జీవసాక్షిణీ,
తస్యా గతివశా ద్విద్యా త్సుఖం దుఃఖం చ రోగిణామ్,

అంగుష్ఠమూలమునందలి నాడి, జీవసాక్షి యనఁబడుంగును. దానిగతి విశేషముచే రోగియొక్క సుఖదుఃఖంబుల నెఱుంగవలయు.

## నాడీ నామములు.

స్నాయు ర్నాడి వసాహింస్రా ధమనీ ధామనీ ధరా,
తంతుకీ జీవితజ్ఞాచ సిరా పర్యాయవాచకాః. 27

నాడికి స్నాయు వనియు, వస యనియు, హింస్ర యనియు, ధమని యనియు, ధామని యనియు, ధర యనియు, తంతుకి యనియు, జీవితజ్ఞ యనియు, సిర యనియు పర్యాయ నామంబులు గలవు.

## నాడీ చిహ్నములు.

ఆదౌ చ వహతే వాతో మధ్యే పిత్తం తథైవ చ,
అంతే చ వహతే శ్లేష్మ నాడికాత్రయ లక్షణమ్. 28

రోగి మణిబంధమునందు ధాతువును వైద్యుఁడు బరీక్షించునపుడు, తనతర్జనికి స్పృశించెడినాడి వాతమనియు, మధ్యమాంగుళికి స్పృశించెడినాడి పిత్తమనియు, అనామికాంగుళికి స్పృశించెడినాడి శ్లేష్మ మనియు నెఱుంగ వలయును.

వాతాధికావహే న్మధ్యే త్వగ్రే వహతి పిత్తలా,
అంతేచ వహతే శ్లేష్మ మిశ్రితే మిశ్రితా భవేత్. 29

మధ్యమాంగుళియందు నాడి అతివేగంబుగ నడుచుచుండెనేని వాతరోగంబనియు, తర్జనియందు నాడి అతివేగంబుగ నడుచుచుండెనేని పిత్తరోగం బనియు, అనామికయం దతివేగముగ నాడి నడుచుచుండెనేని శ్లేష్మరోగం బనియు, మధ్యమ తర్జనులయందు మిశ్రమమై యతివేగంబుగ నాడి నడుచుచుండెనేని పిత్తవాతం బనియు, మధ్యమానామికలయందు మిశ్రమమై యతివేగంబుగ నాడి నడుచుచుండెనేని వాతశీతలం బనియు, మధ్యమాంగుళినాడి క్షీణించి అనామికా తర్జనీనాడులు మిశ్రమమై యతి

వేగముగ నడుచుచుండెనేని పిత్తశీతలం బనియు, వాత, పిత్త, శ్లేష్మములు మూఁడును సంకరం బయ్యేనేని త్రిదోషం బనియు నెఱుఁగవలయును.

తృణం పురస్సరం కృత్వా యథా వాతో వహేద్బలీ,
శేషస్థం తృణమాదాయ పృథివ్యాం వక్రగా యథా.
తథా మధ్యగతో వాయుః కృత్వా పిత్తం పురస్సరమ్,
శేషస్థం కఫమాదాయ నాడ్యాం వహతి సర్వదా. 31
గతిః పిత్తస్యాఽత ఏవ చంచలే త్యనిలాగ్రతః,
కఫస్యమందాగతిర్వా వాయోః పృష్ఠత్వసంభవా. 32

వాయువు వీచునపుడు దాని కెదుటనుండు తృణము విశేషంబుగను, వెనుకనుండు తృణము మందముగను చలించెడి చందంబున, మధ్యమునం దుండెడి వాతము ఎదుటనుండెడి పిత్తమును అధికముగ చలించునటులను, వెనుకనుండెడి శ్లేష్మమును మందముగ చలించునటులను జేయును.

అన్యచ్చ.—

పిత్తశ్లేష్మగతి ర్నాస్తి వాతస్య గమనే గతిః,
తస్మాత్త్వగ్రేవహేద్వాయు ర్జలూకా వక్రగా యథా. 33

పిత్తశ్లేష్మనాడులు స్వతంత్రరహితంబుగనుండును. వాతనాడి గమనము ననుసరించియే పిత్తశ్లేష్మంబులకును గమనము గలిగియుండును. కాఁబట్టి చక్రముగ సంచరించెడి జలూకచందంబున నాడులకు అగ్రంబుననుండెడి వాతనాడి చలించెనేని, పిత్తశ్లేష్మంబులును చలించును.

## స్వస్థ నాడీలక్షణము.

భూలతా భుజగప్రాయా స్వచ్ఛా స్వాస్థ్యమయీ సిరా,
సుఖితస్య స్థితా జ్ఞేయా తథా బలవతీ మతా. 34

రోగరహితుఁడగు మనుజునినాడి, భూతల యనంబడు. ఆనాడి అట్టివానికి సర్పము చలించెడి చందంబున స్థిరముగను, బలిష్ఠముగను నడుచు చుండును.

అన్యచ్చ.—

ప్రాతస్స్నిగ్ధమయీనాడీ మధ్యాహ్నే ప్యుష్ణతాన్వితా,
సాయాహ్నే ధావమానాచ చిరా ద్రోగవివర్జితా. 35

చిరకాలముగ రోగములేకుండెడి వానినాడి, ప్రాతఃకాలంబున రూక్షరహితంబుగను, మధ్యాహ్నంబున నుష్ణప్రకోపంబుగను, సాయాహ్నంబున తీవ్రముగను నడుచుచుండును.

## దోషనాడీ లక్షణము.

వాతా ద్వక్రగతా నాడీ చపలా పిత్తవాహినీ,
స్థిరా శ్లేష్మవతీ జ్ఞేయా మిశ్రితే మిశ్రితా భవేత్. 36

నాడి వాతరోగంబున వక్రంబుగను, పిత్తరోగంబున చంచలముగను, శ్లేష్మ రోగంబున స్థిరముగను, ద్వంద్వరోగంబున మిశ్రమముగను నడుచును.

## వాతపిత్తరోగనాడీ లక్షణము.

సర్పజలౌకాదిగతిం వదంతి విద్వాంసః ప్రభంజనే నాడీమ్,
పిత్తేచ కాక లావక భేకాదిగతిం విదు స్సుధియః. 37

వాతరోగంబున నాడి సర్పము, జలూకము వీనివలెను, పిత్తరోగంబున నాడి కాకి, లావుకపిట్ట, కప్ప వీనివలెను నడుచును.

## శ్లేష్మరోగనాడీ లక్షణము.

రాజహంసమయూరాణాం పారావత కపోతయోః,
కుక్కుటాదిగతిం ధత్తే ధమనీ కఫసంవృతా. 38

శ్లేష్మరోగంబులనాడి హంస, నెమలి, పావురము, గువ్వ, కోడి, వీనివలె నడుచును.

## వాతపిత్తరోగనాడీ లక్షణము.

ముహు స్సర్పగతి ర్నాడీ ముహు ర్భేకగతి స్తథా,
వాతపిత్తద్వయోద్భూతాం ప్రవదంతి విచక్షణాః. 39

వాతపిత్తరోగంబున నాడి పలుమాఱు సర్పగతికలదిగను, మాటి మాటికి కప్పవలెను నడుచును.

## వాతశ్లేష్మ నాడీ లక్షణము.

భుజగాదిగతి స్తస్యా రాజహంసగతి స్తథా,
వాతశ్లేష్మద్వయోద్భూతాం భాషంతే తద్విదోజనాః. 40

వాతశ్లేష్మనాడి సర్పము, రాజహంస వీనివలె నడుచును.

## పిత్తశ్లేష్మ నాడీ లక్షణము.

మండూకాదిగతిం నాడీం మయూరాదిగతిం ధరామ్,
పిత్తశ్లేష్మసముద్భూతాం ప్రవదంతి మనీషిణః. 41
సూక్ష్మాశీతా స్థిరా నాడీ పిత్తశ్లేష్మ సముద్భవా,

పిత్తశ్లేష్మనాడి కప్ప, నెమలి మొదలగు వానివలె నడుచుటయేగాక, సూక్ష్మంబుగను, శీతలంబుగను నడచును.

## ప్రకారాంతరవాతశ్లేష్మనాడీ లక్షణము.

కఫవాతోద్భవానాడీ సర్ప హంసగతిర్భవేత్. 42

వాతశ్లేష్మనాడి సర్పము, హంస వీనివలె నడుచును.

## వాతపిత్తకఫసన్నిపాతనాడీ లక్షణము.

లావ తిత్తిరి వర్తకగమనం సన్నిపాతతః,
కదాచి న్మందగానాడీ కదాచి చ్ఛీఘ్రగా భవేత్. 43
త్రిదోషప్రభవే రోగే విజ్ఞేయా చ భిషగ్వరైః,

త్రిదోషమిశ్రితంబగు సన్నిపాతనాడి లావుకపిట్టవలెను, తిత్తిరి పక్షివలెను, మీనవల్లంకిపిట్టవలెను, నడుచుటయగాక, ఒకానొకసమయం బున మందగతిగను, మఱియొకసమయంబున శీఘ్రముగను నడచును.

ఆసాధ్యరోగనాడీ లక్షణము.

మందం మందం శిథిలశిథిలం వ్యాకులం వ్యాకులంవా
స్థిత్వా స్థిత్వా వహతి ధమనీ యాతి నాశంచ సూక్ష్మా,
నిత్యం స్థానా త్స్ఖలతి పునర ప్యంగులీ స్సంస్పృశేద్యా
భావై రేవం బహువిధవిధై స్సన్నిపాతే త్వసాధ్యా. 44

అసాధ్యసన్నిపాతంబున నాడి అతిమందముగను, మిగుల శిథిలంబుగను, మిగుల వ్యాకులముగను, నిలిచినిలిచియును, అతిసూక్ష్మంబుగను, నశించినట్టుగను, పలుమాఱు స్థానచ్యుతంబయ్యును, పలుమాఱు వ్రేళ్లయందును ఇటుల ననేక రీతులుంగ నడచును.

అన్యచ్చ.—

యాత్యుచ్చకాస్థిరాత్యంతా యాచేయం మాంసవాహినీ,
యాచ సూక్ష్మాచ వక్రాచ తామసాధ్యాం విదుర్బుధాః,

అతివేగముగ యెగురుచును, మిగుల స్థిరంబుగను, మాంసంబున సంచరింపుచును, అతిసూక్ష్మంబుగను, అతివక్రముగను నుండెడినాడి యసాధ్యంబని యెఱుంగవలయును.

అన్యచ్చ.—

మహాదాహేపి శీతత్వం శీతత్వే స్థాపితా సిరా,
నానావిధా గతి ర్యస్య తస్య మృత్యు ర్నసంశయః. 46

ఎవనినాడి అత్యుష్ణంబుగ నుండునపు డతిశీతలంబుగను, శీతలంబుగ నుండునపు డతితాపంబుగను నుండుటయగాక, నానావిధ గతియు గలిగి యుండునో అట్టివాఁడు నిశ్చయముగ మరణంబుఁ జెందును.

అన్యచ్చ—

త్రిదోషే స్పందతే నాడీ మత్యుకాలేచ నిశ్చలా,
జ్ఞేయా సర్వవికారేషు వైద్యైః కుశలకర్మభిః. 47

త్రిదోషంబున నాడి సర్వదా చలించుచును, మృత్యుకాల మాసన్నం బైనపుడు నిశ్చలంబుగను నుండును. ఇట్టి భేదంబులను సర్వసన్నిపాతంబుల యందును నెఱుంగవలయును.

సాధ్యరోగనాడీ లక్షణము.

పూర్వం పిత్తగతిం ప్రభంజనగతిం శ్లేష్మాణ మాబిభ్రతీం
సంతానభ్రమణం ముహు ర్విదధతీం చక్రాధిరూఢామివ,
తీవ్రంతం దధతీక్షణాహిగతికాం సూక్ష్మత్వ మాతన్వతీం
నాసాధ్యాం ధమనీం వదంతి సుధియో నాడీగతిజ్ఞానినః. 48

చక్రాధిరూఢుండగువాఁడు సంచరించు చందంబున నాడి ప్రథమంబున పిత్తగతియు, పిదప వాతగతియు, కడపట శ్లేష్మగతియు గలిగి సంచరించుచు కొంతకాలం బతితీవ్రంబుగను, సర్పగతికలదిగను, కొంతకాలము సూక్ష్మంబుగను చలించుచుండెనేని, అట్టినాడి సాధ్యనాడి యని నాడీజ్ఞాన వేత్తలు వచించెదరు.

మాసాంతమృత్యునాడీ లక్షణము.

భూలతా భుజగాకారా నాడీ దేహస్య సంక్రమాత్,
విశీర్ణే క్షీణతాం యాతి మాసాంతే మరణం ధ్రువమ్.

దేహమందలి భుజగాకార మగు భూలత యనునాడి, దేహ సంక్రమమువలన శిథిలంబు జెందినను, జీర్ణంబైనను నట్టివాఁడు మాసాంతంబున మరణంబుఁ జెందును.

నాడి గిఱ్ఱుమని భ్రమరంబువలె బదుగిడుచును, భుజములయందు చలించుచును, అంగుళములయందు చలింపకయుండు నెవనికి నుండునో అట్టివాఁడు పండ్రెండుజాములలో యమమందిరంబున కేఁగును.

దినాంతంబున మృత్యునాడీ లక్షణము.

స్థిత్వానాడీముఖే యస్య విద్యు జ్జ్యోతిరివేక్ష్యతే. 54
దినైకం జీవితం తస్య ద్వితీయే మరణం భవేత్,

ముఖంబున నాడి నిలిచి నిలిచి వర్షాకాలంబున మెఱుపు మెఱయుచందంబున, మిగుల తీవ్రగతిగలిగియుండెనేని, నట్టివాఁ డొకదినము జీవితుఁడై మఱునాఁ డుదయంబున మృత్యువును గాంచును.

జ్వాలావధిమృత్యులక్షణము.

స్వస్థాన విచ్యుతా నాడీ యదా వహతి వాసవా. 55
జ్వాలాచ హృదయే తీవ్రం తదా జ్వాలావధి స్థితిః,

హస్తమునందలి నాడులు స్వస్థానంబునువదలి కొండొకస్థలంబున నాడి సంచరించుచునైనను, సంచరింపకయైనను నుండుటయగాక, హృదయంబున తీవ్రంబగు మంటయును గలిగియుండెనేని, నట్టివాఁ డా మంట నిలుచువఱకు సజీవుఁడుగ నుండి పిదప వైవస్వతుని సదనంబున నివసించును.

అరజాములోని మృత్యునాడీ లక్షణము.

అంగుష్ఠమూలతో బాహ్యే ద్వ్యంగుళే యది నాడికా.
ప్రహరార్ధా ద్బహి ర్మృత్యుం జానీయాచ్చ విచక్షణః,

అంగుష్టమూలమునందలి నాడు లాస్థానంబులనువదలి రెండంగుళముల క్రిందుగా మధ్యమానామికలయందు నడచుచుండెనేని, అట్టివాఁ డరజాము లోపల మరణంబుఁ జెందు,

సార్ధద్వయాంగుళా ద్బాహ్యే యది తిష్ఠతినాడికా. 57
ప్రహరైకా ద్బహిర్మృత్యుం జానీయాచ్చ విచక్షణః,

అంగుష్ఠమూలమందలి నాడు లాస్థానంబును వదలి రెండున్నర అంగుళములకు క్రిందుగా అనామికయందలి నరమునఁ జేరి నడుచుచుండెనేని, అట్టివాఁ డరజాములోపల కాలాంతకుని నిలయంబునఁ బ్రవేశించి యతని భటులతో యుల్లాసంబుగ సల్లాపము సలుపుచుండునని మఱికొందఱు విచక్షణులగువారు వచించెదరు.

### సార్ధప్రహరమృత్యునాడీ లక్షణము.

ద్వ్యంగుళా ద్బాహ్యతో నాడీ మధ్యే రేఖా బహిర్యదా.
సార్ధప్రహారకా న్మృత్యు ర్జాయతే నాత్ర సంశయః,

నాడి తర్జనీ మధ్యమాంగుళములను వదలి, అనామికయందుమాత్రము సంచరించుచు, దానికి క్రింద రేఖాకారంబుగ స్పృశించుచుండెనేని, అట్టివాఁ డొకటిన్నరజాములో యమపురికేఁగును.

### ఆఱుజాము మృత్యునాడీ లక్షణము.

మధ్యే రేఖా సమానాడీ యది తిష్ఠతి నిశ్చలా. 59
షడ్భిస్తు ప్రహరై స్తస్య మృత్యుర్ జ్ఞేయో విచక్షణైః,

అంగుష్ఠమూలమందలి నాడులన్నియు మధ్యమాంగుళి నరమునఁ జేరి, సూక్ష్మంబై నిశ్చలంబుగ నుండెనేని అట్టివాఁ డాఱుజాములలో యమమందిరంబును జేరును.

### తృతీయదివసమృత్యునాడీ లక్షణము.

పాదాంగుళగతా నాడి చంచలా యది గచ్ఛతి. 60
త్రిభిశ్చ దివసై స్తస్య మృత్యు రేవ నసంశయః,

ఎవనికి పాదాంగుళమందలి నాడు లతిచంచలముగనడచుచుండునో, అటువంటివాఁడు మూఁడుదినములలోపల మృత్యువుపా లగును.

### చతుర్థదివస మృత్యునాడీ లక్షణము.

పాదాంగుళగతా నాడీ కోష్ణా వేగవతీ భవేత్. 61
చతుర్భిర్దివసై స్తస్య మృత్యు రేవ న సంశయః,

ఎవనికి నాడులు పాదాంగుళగతంబై కించిదుష్ణంబుతోఁగూడి యతివేగంబుగ నడచుచుండెడినో, అటువంటివానికి, నాలుగుదినములలోపల మరణంబు గలుగును.

## పంచమదివస మృత్యునాడీ లక్షణము.

పాదాంగుళగతా నాడీ మందమందా యదా భవేత్. 62
పఞ్చభిర్దివసై స్తస్య మృత్యు ర్భవతి నాన్యథా,

ఎవనికి పాదాంగుళగతంబగు నాడి మందంబుగ నడచునో, అటువంటి వాఁ డైదుదినములలో మృత్యువును గాంచును.

ఏవం సంఖ్యాది భేదేన నాడీజ్ఞేయా విచక్షణైః. 63
స్వర్గేపి దుర్లభావిద్యా గోపనీయా ప్రయత్నతః,

ఇటుల నాడుల గతిజ్ఞానంబు నెఱింగి విచక్షణులద్వారా సంఖ్యా భేదంబులను దెలిసికొనవలయును. మఱియు, నీనాడీజ్ఞానము త్రిదశులకు సైతము నెఱుంగుట దుర్లభముగాన, నిది గోపనీయంబుగ నుంచుకొనం దగినది.

## అభిఘాతాదిరోగనాడీ లక్షణము.

భారప్రవాహమూర్ఛాభయ శోకప్రముఖ కారణాన్నాడీ,
సమ్మూర్ఛితాపి గాఢం పునరపి సా జీవితం ధత్తే,

భారమును మోయుట, ప్రవాహంబునఁ గొట్టుకొనిపోవుట, మూర్ఛ నొందుట, భయముచెందుట, శోకించుట యీ మొదలగు కార్యంబులు గావించుటచే నాడి యతిగాఢంబుగను, స్తబ్ధంబుగను నుండును. ఐన నట్టి నాడిగలవాఁడు సజీవుఁడుగ నుండును.

పతిత స్కంధితో భేదీ నష్టశుక్రశ్చయో భవేత్. 65
శామ్యతే విస్మయ స్తస్య నకించి న్మృత్యుకారణమ్,

వృక్షాద్యుచ్చస్థానంబులనుండి క్రిందఁబడినవాఁడు, అస్త్రాదులచే మర్మము భేదింపఁబడినవాఁడు, శుక్రనష్టముగలవాఁడు అగు వీరి నాడి,

మృత్యు వాసన్నం బైనవానికి నడిచెడుచందంబున నడుచుచుండును. అయినను అట్టినాడిగలవాఁడు మరణంబు జెందకయుండును.

భూతాభిషంగజ్వరనాడీ లక్షణము.

తథా భూతాభిషంగేపి త్రిదోషవదుపస్థితా. 66
సమాంగావహతే నాడి తథానచ క్రమంగతా,

భూతాభిషంగము గలవానినాడి, త్రిదోషనాడివలె, వాత పిత్త శ్లేష్మంబులు సంకలితమై సమాకారముగ నడచుచుండును.

రోగరహితాపమృత్యు లక్షణము.

అపమృత్యు ర్నరోగాశ్చ నాడీ తత్సన్నిపాతవత్. 67

రోగరహితమై యుండునపుడు, అపమృత్యువును గాంచెడివాని నాడి, సన్నిపాతనాడివలె నడచుచుండును.

శోకహిమాది నిశ్చలనాడీ లక్షణము.

స్వస్థానహీనా శోకేచ హిమాక్రాంతేచ నిర్గదాః,
భవంతీ నిశ్చలా నాడ్యో న కించి త్తత్ర దూషణమ్. 68

శోకమును జెందినవానియొక్కయు, మంచులో సంచరించినవానియొక్కయు నాడి స్వస్థానంబునుండి చ్యుతంబై నిశ్చలంబుగనుండును. అట్లుండినను, వానికి దోషము జనింపకయుండును.

దుష్టపిత్తనాడీ లక్షణము.

స్తోకం వాతకఫం దుష్టం పిత్తం వహతి దారుణమ్,
పిత్తస్థానం విజానీయా ద్భేషజం తస్య కారయేత్. 69

దుష్టపిత్తదోషంబున వాతశ్లేష్మనాడులు మిగుల అల్పంబుగను, పిత్తనాడి అతిదారుణంబుగను, నడుచుచుండుగాన, వీనినెఱింగినవైద్యుఁడు చికిత్స చేయవలయును.

### సాధ్యనాడీ లక్షణము.

స్వస్థాన చ్యవనం యావ ద్ధమన్యా నోపజాయతే,
తత్సచిహ్నస్య సత్వేపి నాసాధ్యత్వ మితి స్థితిః. 70

స్వస్థానంబునుండి నాడి చ్యుతముగాకయుండెడివాని రోగము సాధ్యంబనియుం, నాడికి స్వస్థానచ్యుతము గలిగె నేని అట్టివానిరోగం బసాధ్యంబనియుం దెలియంగవలయును.

### ధాతుప్రాప్తనాడీ లక్షణము.

యదాయం ధాతు మాప్నోతి తదా నాడీ తథా గతిః,
తథాహి సుఖసాధ్యత్వం నాడిజ్ఞానేన బుద్ధ్యతే. 71

వాత పిత్త శ్లేష్మ ధాతువులలో ఏధాతువును నాడి యేకాలంబున నాశ్రయించియుండునో, ఆకాలగతియే వానికిని గలిగియుండుగాన, యా నాడీజ్ఞానముచే తత్తద్రోగానుసారంబు లగుచికిత్సలం జేయవలయును.

### సదోషనిర్దోషనాడీలక్షణము.

నాడీ యథా కాలగతి స్త్రయాణాం
ప్రకోపశాంత్యాదిభిరేవ భూయః,
వాతాదిదోషే చ భవేత్ప్రకోపా
స్థూలాల్పగా పాశ నియంత్రితేస్యాత్. 72

నాడి సదా వాతపిత్తశ్లేష్మ యుక్తంబుగ నుండును. మఱియుఁ, నాడి వాతాదిరోగంబులయందు ప్రకోపంబుగను, నీరోగంబున శాంతత్వమును బొంది యథారీతిగను, వాతాదిదోషంబున రోగయుక్తమై ప్రకోపంబుగను, పాశాదిబద్ధంబున స్థూలముగను అల్పముగను నడచుచుండును.

### నూనె, బెల్లము, మినుములు, పాలు, తేనె, వీనిని సేవించినవాని నాడీలక్షణము.

పుష్టిస్తైలే గుడాహారే మాషేచ లగుడాకృతిః,
క్షీరేచ స్తిమితా వేగా మధురే భేకవద్గతిః. 73

నూనె సేవించియుండెడువానినాడి పుష్టిగనుండును. బెల్లము, మినుములు వీనిని భుజించియుండెడువానినాడి దుడ్డుకట్టవలె నిడుపుగ నడచుచుండును. పాలుత్రాగి యుండెడువానినాడి స్తిమితముగను, నిలిచి నిలిచి మందముగను నడచుచుండును. తేనెత్రాగియుండెడువానినాడి కప్పవలె నడచుచుండును.

{ మధురము, వగరు, పులుసు, ఉష్ణము, చేదు అనునీ పదార్థము లాహారించిన వాని నాడీలక్షణము. }

మధురే బర్హిగమనా తిక్తేస్యాత్ స్థూలతా గతిః,
అమ్లే కోష్ణాప్లవగతిః కటుకై ర్భృంగసన్నిభా. 74

మధురపదార్థములు భుజించినవానినాడి మయూరంబువలె నడచును. చేదుపదార్థములు భుజించినవానినాడి స్థబ్ధముగనుండును. పులుసు, కించిదుష్ణము గలపదార్థములు భుజించినవానినాడి ఎగిరెగిరి నడచును. వగరు పదార్థములు భుజించినవానినాడి భ్రమరంబువలె గిఱ్ఱుమని నడచుచుండును.

కారము, ఉప్పు గలపదార్థములు భుజించినవాని నాడీలక్షణము.

కషాయే కఠినామ్లానా లవణే సరళా ద్రుతా,
ఏవం ద్విత్రి చతుర్యోగే నానాధర్మవతీ ధరా. 75

కారముగలపదార్థములను భుజించినవానినాడి కఠినంబుగను, వాడినట్లు నుండును. ఉప్పుగలపదార్థములను భుజించినవానినాడి ఋజువుగను, తేలికగను, వేగముగను నడచుచుండును. మఱియు రెండుపదార్థంబులనైనను, మూఁడుపదార్థంబులనైనను నేకంబుగ భుజించినవానినాడి పలువిధంబులుగ నడచుచుండును.

{ ద్రవపదార్థములు, కఠిన ద్రవ్యములు భుజించినవాని నాడీలక్షణము. }

ద్రవేతి కఠినానాడీ కోమలా కఠినాశనే,
ద్రవద్రవ్యస్య కాఠిన్యే కోమలా కఠినాపి చ. 76

ద్రవద్రవ్యములను భుజించినవాని నాడి కఠినంబుగను, మిగులకఠినంబులగు ద్రవ్యములను భుజించినవానినాడి కోమలంబుగను, ద్రవద్రవ్యములను కఠినద్రవ్యములను సేవించినవానినాడి కోమలంబుగను, కఠినంబుగను నడచుచుండును.

పులుసు, మధురామ్లము, అటుకులు, భ్రష్టద్రవ్యములు, భుజించినవాని నాడీలక్షణము.

అమ్లైశ్చ మధురామ్లైశ్చ నాడీ శీతా విశేషతః,
చిపిటై ర్భ్రిష్టద్రవ్యైశ్చ స్థిరా మందతరాభవేత్. 77

పులుసునైనను, మధురముతోడి పులుసుగల పదార్థములనైనను, భుజించినవానినాడి మిగుల శీతలంబుగను, అటుకులు మొదలగు ద్రవ్యములను, వేయించిన ద్రవ్యంబులను సేవించినవానినాడి స్థిరముగను, మందముగను నడచుచుండును.

గుమ్మడుకాయ, అరఁటికాయ, ఆకుకూరలు మొదలగు వానిని భుజించినవాని నాడీలక్షణము.

కూశ్మాండై ర్మూలకైశ్చైవ మందమందాచ నాడికాః,
శాకైశ్చ కదళైశ్చైవ రక్తపూర్ణేచ నాడికా. 78

గుమ్మడికాయ, ముల్లంగి మొదలగు గడ్డలను భుజించినవాని నాడి మందముగను, ఆకుకూరలు, అరఁటి వీనిని భుజించినవానినాడి రక్తపుష్టి గలవానినాడిచందంబుగను నడచుచుండును.

మాంసము, దుగ్ధము, గుడము, క్షీరము, పిండి మొదలగు వానిని భుజించిన వాని నాడీలక్షణము.

మాంసా త్స్థిరవహా నాడీ దుగ్ధే శీతా బలీయసీ,
గుడైః క్షీరైశ్చ పిష్టైశ్చ స్థిరా మందవహా భవేత్. 79

మాంసమును భుజించినవానినాడి స్థిరంబుగను, పాలుత్రాగినవాని నాడి మిగుల శీతలముగను, పాలు, బెల్లము వీనితోఁజేయంబడినరొట్టెలు, మొదలగువానిని భుజించినవానినాడి స్థిరముగను, మందమందముగను నడచుచుండును.

{ బెల్లము, అరఁటిపండ్లు, మాంసము, ఉష్ణపదార్థములు, ఎండిన తీక్ష్ణపదార్థములు మొదలగువానిని భుజించినవానినాడీలక్షణము. }

గుడ రంభా మాంస రూక్ష శుష్క తీక్ష్ణాది భోజనాత్,
వాత పిత్తార్తి రూపేణ నాడీసహాతి నిశ్చితా. 80

బెల్లము, అరఁటిపండ్లు, మాంసము, రూక్షద్రవ్యములు, ఎండిన పదార్థములు మొదలగు తీక్ష్ణద్రవ్యములను భుజించినవానినాడి వాతపిత్తరోగముగలవాని నాడిచందంబున నడచుచుండును.

{ ప్రాతఃకాలము, మధ్యాహ్నకాలము, సాయంకాలము, రాత్రికాలము వీనియందలినాడీలక్షణము. }

ప్రాతస్స్నిగ్ధమయీనాడీ మధ్యాహ్నేప్యుష్ణతాఽన్వితా,
సాయాహ్నే ధావమానాచ రాత్రౌ వేగవివర్జితా. 81

నాడి ప్రాతఃకాలంబున కోమలంబుగను మధ్యాహ్నంబున నుష్ణగతిగను సాయాహ్నంబున నతివేగంబుగను రాత్రులయందు వేగరహితంబుగను నడచుచుండును.

బంధింపఁబడిన నిరోగినాడీలక్షణము.

ప్రకృతిస్థాతు సా నాడీ సదా జ్ఞేయా భిషగ్వరైః,
అంగగ్రహాణ నాడీనాం భవంతి మంథరస్థవాః. 82

పైనిచెప్పంబడినమాడ్కి స్వభావముగ నుండెడివాఁడు పాశాదిబద్ధుం డైనపుడు వానినాడి స్థూలగతి, అల్పగతి, మందూకగతి గలదై యుండును.

ఈ జ్వరదాహసన్నిపాత నాడీలక్షణము.

ప్లవ ప్రబలతాం యాతి జ్వరదాహాభిభూతయే,
సన్నిపాతికరూపేణ భవంతి సర్వవేదనాః. 83

మిగుల తాపయుక్త మగు జ్వరముగల రోగికి, అధికముగ చెమట వడియుచుండుటయేగాక నాడియు సన్నిపాతంబువలె నడచుచుండును. మఱియు, పైన నుదహరింపఁబడిన లక్షణంబులుగలజ్వరము, దాహము ఇవి సన్నిపాతంబునందుఁ గలిగెనేని యనేక వేదనలు కల్గును.

ఈ జ్వరప్రకోప నాడీలక్షణము.

జ్వరప్రకోపే ధమనీ సోష్ణా వేగవతీ భవేత్. 84

జ్వరప్రకోపంబున నాడీ వేఁడిమిగను అతి వేగముగను నడచుచుండును.

ఈ జ్వరవాతసంభోగరాత్ర్యుషఃకాల నాడీలక్షణము.

జ్వరేచ వక్రం ధావంతి తథాచ మరుతః ప్లవే,
రత్యంతేచ నిశిప్రాత స్తప్తాదపి శిఖోపమా. 85

జ్వరము, వాతరోగము వీనియందు నాడి వంకరగ నడచును. మఱియు స్త్రీసంభోగాంతమందును, రాత్రులయందును, అరుణోదయకాలంబునను నాడి ఉష్ణముతోఁగూడి రోమాకారంబుగ నడచుచుండును.

ఈ పిత్తజ్వర, కఠినాహార నాడీలక్షణము.

ద్రుతాచ సరళా దీర్ఘా శీఘ్రా పిత్తజ్వరే భవేత్,
శీఘ్రమాహననం నాడీ కాఠిన్యా చ్చలతే తథా. 86

పిత్తజ్వరంబున నాడి సరళంబై ద్రుతగతితోఁగూడి, దీర్ఘంబుగను, శీఘ్రముగను నడచుచుండును. కఠినద్రవ్యములను సేవించినపుడు నాడి ఒకని ప్రహరించుటకై పరుగిడువాని చందంబున శీఘ్రముగ నడచుచుండును.

### మలాజీర్ణ, శ్లేష్మదోష నాడీలక్షణము.

మలాజీర్ణేన నితరాం స్పందనం పరికీర్తితమ్,
నాడీ తంతుసమా మందా శీతలా శ్లేష్మదోషణా. 87

మలాధిక్యమునందును, అజీర్ణమునందును నాడి తంతువుభంగి చలించుచుండును. శ్లేష్మాధిక్యంబున నాడి శీతలముగను, మందముగను నడచుచుండును.

### వాతపిత్త శ్లేష్మవాత నాడీలక్షణము.

చంచలా తరళా స్థూలా కఠినా వాతపిత్తజా,
ఈషచ్చ దృశ్యతే తూష్ణా మందాస్యా చ్ఛ్లేష్మవాతజా. 88

వాతపిత్తదోషంబున నాడి చంచలముగను, ప్రకాశముగను, స్థూలముగను, కఠినముగను నడచుచుండును. మఱియు శ్లేష్మ వాతరోగంబున నాడి కించిదుష్ణంబుగను, మందముగను నడచుచుండును.

### అల్పశ్లేష్మ, ప్రబలవాత, ఉష్ణవాత నాడీలక్షణము

నిరంతరం ఖరం రూక్షం మందశ్లేష్మాతివాతలా,
రూక్షవాతభవే తస్య నాడీస్యా త్పిండసన్నిభా. 89

అల్పశ్లేష్మదోషమునందును, ప్రబలవాతదోషమునందును నాడి సంతతము తీక్ష్ణంబుగను ఉష్ణముగను నడచుచుండును. ఉష్ణవాతంబున నాడి పిండమువలె బాధాకారముగ నడచుచుండును.

### సహజవాత, తీవ్రవాతనాడీలక్షణము.

సౌమ్యా సూక్ష్మాస్థిరా మందా నాడీ సహజవాతజా,
స్థూలాచ కఠినా శీఘ్రా స్పందతే తీవ్రమారుతే. 90

సహజవాతంబున నాడి సౌమ్యంబుగను, సూక్ష్మముగను, స్థిరముగను, మందముగను నడచుచుండును. మఱియుం తీవ్రవాతంబున నాడి స్థూలముగను, కఠినముగను, శీఘ్రముగను నడచుచుండును.

### జ్వర ప్రకోప, కామ, క్రోధ, వేగ, రోధ, చింతా నాడీలక్షణము.

జ్వరప్రకోపే ధమనీ సోష్ణా వేగయుతా భవేత్,
కామాత్క్రోధాద్వేగరోధా త్క్షీణా చింతాభరప్లుతామ్.

కామము, క్రోధము, మలమూత్రాది నిరోధము, చింత, అభిఘాతము వీనిచే జ్వరము ప్రకోపించెనేని, నట్టికాలంబున నాడి ఉష్ణంబుగను, అతి వేగముగను నడచుచుండును.

### దుష్ట రక్తనాడీలక్షణము.

మధ్యే కరే వహేన్నాడీ యది సంతర్పితా ధ్రువమ్,
తదానూనం మనుష్యాణాం రుధిరాపూరితామలాః. 92

దుష్టరక్తము దేహంబున వృద్ధిం జెందెనేని, యారక్తము పచ్యమానాశయమునందలి మలంబుతోఁ జేరును. అప్పుడు నాడి సంతాపయుక్తమై మధ్యహస్తంబున చలించుచుండును.

### భూతజ్వర, ఏకాహిజ్వర, విషమజ్వర నాడీలక్షణము.

భూతజ్వరేనేక ఇవాతివేగా
ధావంతి నద్యోహి యథాబ్ధిగామాః,
ఏకాహికేన క్వచన ప్రదూరే
క్షణాంతగామా విషమజ్వరేణ. 93

భూతజ్వరంబున నాడి సముద్రంబునఁ బడఁబోయెడి నదులు ప్రవహించుచందంబున, అతివేగంబుగ నడచుచుండును. మఱియు, ఏకాహికము, విషమజ్వరము వీనియందు నాడి కొంతకాలం బతివేగంబుగను, విశ్రాంతి జెందియు నడచుచుండును.

### ద్వ్యాహిక, త్ర్యాహిక, చాతుర్థిక జ్వరనాడీలక్షణము.

ద్వితీయకే వాథ తృతీయ తుర్యయో
ర్గచ్ఛంతి తప్తా భ్రమరక్రమేణ. 94

ద్వ్యాహిక, త్ర్యాహిక, చాతుర్థిక జ్వరములయందు నాడి మిగుల
ష్టంబులోఁగూడి భ్రమరంబువలె నడచుచుండును.

## క్రోధజ్వర, కామజ్వర నాడీలక్షణము.

క్రోధజే సంగలగ్నాంగా సంసంగా కామజే జ్వరే. 95

క్రోధజ్వరమున నాడి పరస్పరశ్లిష్టముగను, కామజ్వరమున నాడి
యొకటిలోనొకటి మిగుల కలసినట్లుగను నడచుచుండును.

## రమణజ్వరము, కామార్తజ్వరము వీటియందు నాడీలక్షణము.

జ్వరేచ రమణీ నాడీ క్షీణాంగా మందగామినీ,
జ్వరే కామార్తరూపేణ భవంతి వికలా స్సిరాః. 96

స్త్రీకి పురుషవిరహముచే జనించిన జ్వరమున నాడి క్షీణించినట్టుగను,
ందముగను, పురుషునికి స్త్రీవిరహముచే జనించిన జ్వరంబున నాడి శిథిల
థిలంబుగను నడచుచుండును.

## వ్యాయామ, భ్రమణ, చింతా, ధనశోక నాడీలక్షణము.

వ్యాయామే భ్రమణే చైవ చింతాయాం ధనశోకతః,
నానాప్రకారగమనా సిరా గచ్ఛతి విజ్వరే. 97

పనిసేయుట, సంచరించుట, చింతపడుట, ధనాదులు పోవుటచే దుః
ంచుట, ఇట్టికార్యంబులవలన జ్వరములేనివానికి సయితము నాడి యనేక
ీతులుగ నడచుచుండును.

## అజీర్ణ నాడీలక్షణము.

అజీర్ణేతు భవే న్నాడీ కఠినా పరితోజడా,
ప్రసన్నాతు ద్రుతా శుద్ధా త్వరితాచ ప్రవర్తతే 98

అజీర్ణంబున నాడి కఠినంబుగను, సర్వత్ర జడత్వముతోఁ గూడినదిగను, నిర్మలముగను, వేగముగను, అశుద్ధముగను, పరుగిడునటులను నడచుచుండును.

పక్వాజీర్ణ, రక్తపూర్ణ, రసయుక్త నాడీలక్షణము.

పక్వాజీర్ణే పుష్టిహీనా మందమందం వహేత్తు యా,
అసృక్పూర్ణా భవేత్కోష్ణా గుర్వీ సామా గరీయసీ. 99

పక్వాజీర్ణంబున నాడి పుష్టిరహితముగను, మెల్ల మెల్లగను నడచుచుండును. శరీరంబున రక్తం బధికముగ నుండునపుడు, నాడి కొంచె ముష్ణముగ నడచుచుండును. ఆమాజీర్ణయుక్తమగు నాడి గురుత్వము గలదియై నడుచుచుండును.

{ సుఖము ననుభవించెడివాఁడు, ఆఁకలిగొన్నవాఁడు, మందాగ్ని క్షీణధాతువుగలవాఁడు వీరి నాడీలక్షణము. }

సుఖితస్య స్థిరా జ్ఞేయా చపలా క్షుధితస్య సా,
మందాగ్నేః క్షీణధాతోశ్చ నాడీ మందతరా భవేత్.

సుఖితుం డగువాని నాడి స్థిరముగను, ఆఁకలితోఁగూడి యుండెడువాని నాడి చపలముగను, మందాగ్నిగలవాఁడు, బలము కొఱవడినవాఁడు వీరినాడి అతిమందముగను నడచుచుండును.

ప్రకారాంతర మందాగ్ని నాడీలక్షణము.

మందేగ్నౌ క్షీణతాం యాతి నాడిహంసాకృతి స్తథా.

మందాగ్నిగలవాని నాడి, క్షీణంబై హంసవలె నడచుచుండును.

ఆమాశ్రయ, పుష్టివివర్ధన, ఆహారమాంద్య, ఉపవాసనాడీలక్షణము.

ఆమాశ్రయే పుష్టివివర్ధనేన
భవంతి నాడ్యో భుజగైకవృత్తాః,

ఆహారమాంద్యా దుపవాసతో వా
తథైవ నాడ్యో భుజగప్రమాణాః. 102

ఆమాశ్రయమున నాడి పుష్టిగలిగియుండిన, సర్పసమాకారంబుగ నడచుచుండును. ఆహారమాంద్యము, ఉపవాసము వీనియందు నాడి సర్పంబువలె నడచుచుండును.

## దీప్తాగ్ని నాడీ లక్షణము.

లఘ్వీ వహతి దీప్తాగ్నే స్తథా వేగవతీ స్మృతా. 103

దీప్తాగ్నియందు నాడి లఘువుగను, వేగముగను నడచుచుండును.

## అగ్నిమాంద్య, గ్రహణీరోగ నాడీలక్షణము.

పాదేచ హంసగమనా కరే మండూకసంప్లవా,
తస్యాగ్నేర్మందతా దేహే త్వథవా గ్రహణీగదః. 104

అగ్నిమాంద్యము, గ్రహణీరోగము వీనియందు నాడి పాదంబున హంసవలెను, హస్తంబున కప్పవలెను నడచుచుండును.

## మలభేద, గ్రహణీరోగ, అతిసారభేద, విలంబికా, ఆమాతిసార నాడీలక్షణము.

భేదేన శాంతా గ్రహణీగదేన
నిర్వీర్యరూపా త్వతిసారభేదే,
విలంబికాయాం ప్లవగా కదాచి
దామాతిసారే పృథులా తథా చ. 105

నాడి మలభేదంబున శాంతముగనుండును. గ్రహణీరోగము, అతిసారము, వీనియందు తేజోహీనంబుగను, విలంబికయును రోగంబున పడవవలెను, ఆమాతిసారంబున ప్రేలుచుండెడు చందంబునను నడచుచుండును.

### మూత్రమల నిరోధ, విడ్గ్రహ, విషూచికానాడీలక్షణము.

నిరోధే మూత్రశకృతో విడ్గ్రహేతితరాం శ్రితాః,
విషూచికాభిభూతేచ భవంతి భేకవత్క్రమాః. 106

మలమూత్రములను నిరోధించిన వానినాడి, అతివేగంబుగ నడచుచుండును. మఱియు, విషూచికారోగంబున నాడి కప్పవలె నడచుచుండును.

### అనాహ, మూత్రకృచ్ఛ్ర నాడీలక్షణము.

అనాహే మూత్రకృచ్ఛ్రేచ భవేన్నాడీ గరిష్ఠతా. 107

అనాహక మనెడి కామిలారోగము, మూత్రకృచ్ఛ్రము వీనియందు నాడి గరిష్ఠముగ నడచుచుండును.

### వాతశూల, మరుత్ ప్లవ నాడీలక్షణము.

వాతేన శూలేన మరుత్ ప్లవేన
సదోపవక్రాహి సిరా వహంతి. 108

వాతరోగము, శూలరోగము, మరుత్ప్లవము వీనియందు నాడి వక్రముగ నడచుచుండును.

### పైత్య, ఆమశూల నాడీలక్షణము.

జ్వాలామయీ పిత్తవిచేష్టితేన
సామేన శూలేనచ పుష్టిరూపా. 109

పైత్యరోగంబున నాడి జ్వాలంబోలి ధగధగ మనియు, ఆమశూలంబున పుష్టిగను నడచుచుండు.

### ప్రమేహ, ఆమదూషణ నాడీలక్షణము.

ప్రమేహే గ్రంథిరూపాచ ప్రసుప్తా చామదూషణే. 110

ప్రమేహంబున నాడి మిశ్రమంబై గ్రంథిరూపంబుగను, ఆమదోషం బున నిదురగాంచినటులను నడచుచుండును.

{ విషదోష, విష్టంభవాత, గుల్మ, అత్యర్థవాత, అసమాప్తికాల నాడీలక్షణము. }

ఉత్పిచ్ఛరూపా విషరిష్టికాయాం
విష్టంభగుల్మేనచ వక్రరూపా,
అత్యర్థవాతేన అధ స్స్ఫురంతీ
ఉత్తానభేదిన్యసమాప్తికాలే. 111

నాడి విషదోషంబునం దూర్ధ్వగతి గలిగియుం, విష్టంభ గుల్మరోగం బున మిగుల అధోభాగంబునను, వాయుంసమాప్తికాలంబున ఊర్ధ్వభాగంబున నెగసిపడునట్లును నడచుచుండును.

గుల్మ, కంప, పరాక్రమ నాడీలక్షణము.

గుల్మేన కంపేన పరాక్రమేణ పారావతస్యేవ గతిం కరోతి.

గుల్మరోగము, కంపము, పరాక్రమము వీనియందు నాడి పావురపిట్టవలె నడచుచుండును.

వ్రణ, భగంధర నాడీలక్షణము.

వ్రణార్థం కఠినే దేహే ప్రయాతి పైత్తికం క్రమమ్,
భగన్ధరానురూపేణ నాడీ వ్రణనివేదనే. 113

వ్రణము, భగంధరము ఇవి కలవానినాడి పైత్త్యోల్బణంబుగ నడచుచుండును.

వాంత, శల్యాభిహత, వేగావరోధ, వ్యాకులజన నాడీలక్షణము.

వాంతస్య శల్యాభి హతస్య జంతో
ర్వేగావరోధా కలితస్య భూయః,
గతి ర్ద్విధ త్తేధమనీ గజేంద్ర
మరాళమానేవ కఫోల్బణేన. 114

వమనం బొనర్చికొనినవాఁడు, శల్యముచే నిజదేహంబున కభిఘాతము జెందినవాఁడు, వేగావరోధుఁడు వీరలనాడి మదించిన గజము, హంస వీనివలె నడచుచుండుటయగాక, శ్లేష్మంబును నధికముగఁ బ్రకోపించి యుండును.

## నాడీజ్ఞానరహితుఁడు శ్లాఘన కనర్హుఁడనుట.

నాడీజ్ఞానం వినా కశ్చి త్సత్సు నశ్లాఘ్యతాం వ్రజేత్,
తస్మా ద్విద్వా న్ప్రయత్నేన తద్ జ్ఞానం సముపాచరేత్.

నాడీజ్ఞానంబు నెఱుంగనివైద్యుఁడు విద్వాంసు లగు వైద్యుల సభలలో శ్లాఘింపఁబడఁడు. కావున, నాడీజ్ఞానమును అవశ్యముగ వైద్యుఁడు నెఱుంగవలయును.

## గ్రంథానుసంధానదేశకాలప్రకరణ నాడీజ్ఞానము.

క్వచి ద్గ్రంథానుసంధానా త్కాల దేశ విభాగతః,
క్వచిత్ప్రకరణా చ్చాపి నాడీజ్ఞానం భవే దిహ. 116

ఈనాడీశాస్త్రంబు నెఱుంగంగోరువారు, కొన్ని నాడులగతిని గ్రంథానుసంధానంబువలనను, కొన్నిటిని వసంతాది కాలభేదంబులవలనను, కొన్ని నాడులను దేశభేదంబులవలనను, కొన్నిటిని తత్కాలప్రకరణమువలనను నెఱుంగవలయును.

## నాడీజ్ఞానప్రాప్తి లక్షణము.

సద్గురో రుపదేశాచ్చ దేవతానాం ప్రసాదతః,
నాడీపరిచయో లోకే ప్రాయః పుణ్యేన జాయతే. 117

మఱియు పైనాడీజ్ఞానము పూర్వజన్మ తపఃఫలంబుచే లభించెడుసద్గురూపదేశముచేతను, దేవతా ప్రసాదముచేతను గలుగును.

ఆంగ్లేయ మతానుసార

# నాడీజ్ఞానము



శ్లో. స్వస్థానాం దేహినాం దేహే వయోవస్థా విశేషతః,
ప్రచలంతి యథానాడ్య స్తత్సజ్ఞ్యాన మిహోచ్యతే. 1

తా. రోగరహితు లగు మనుజుల బాల్య యౌవన వృద్ధత్వముల యందలి నాడీగతి విశేషంబుల దెలియంజేసెదను.

సార్ధద్వయపలః కాలో యావద్గచ్ఛతి జన్మతః,
తావ త్ప్రకంపతే నాడీ చత్వారింశ చ్ఛతాధికమ్. 2

మానవుఁడు జనించిన క్షణమునందు నతనినాడి యొకఘంటకాలము లోపల (౧౪౦) మాఱులు చలించుచుండును

తదూర్ధ్వం వత్సరం యావ త్సార్ధద్వయపలేన సా,
ముహుః ప్రకంప మాధత్తే త్రింశద్వారం శతోత్తరమ్. 3

జనించిన కాలము మొదలుకొని యొకసంవత్సరమువఱకు ఆతని నాడి యొకఘంటకాలములోపల (౧౩౦) పర్యాయములు చలించుచుండును.

ఉపరిష్టాదా ద్వితీయా త్తావత్కాలే శరీరిణః,
తతః ప్రకంపతే నాడీ దశాధికశతం ముహుః. 4

ఒక్కసంవత్సరము మొదలుకొని రెండువత్సరములు గతించువఱకు (౧౧౦) మార్లు నాడి చలించుచుండును.

తత స్త్రివత్సరం వ్యాప్య దేహినాం ధమనీ పునః,
ముహుః ప్రకంపతే తద్వ త్సార్ధద్వయపరంశతమ్. 5

రెండువత్సరములు మొదలుకొని మూఁడువత్సరములవఱకు (౧౦౫) మాఱులే నాడి చలించుచుండును.

తత స్త్వాస ప్తమా ద్వర్షా న్నవతిస్స్యా త్ప్రవేపనమ్,
ధమన్యా స్తస్మి తేకాలే ప్రత్యక్షా దనుభూయతే. 6

నాలవవత్సరము మొదలుకొని యేడవవత్సరమువఱకు (౯౦) మార్లు నాడి చలించుచుండును. (ఇది ప్రత్యక్షానుభవము.)

తత శ్చతుర్దశం తావ త్పంచాశీతిప్రవేపనమ్,
త్రింశద్వర్షమభివ్యాప్య తతోఽశీతి ప్రకీర్తితమ్. 7

ఏడవవత్సరము మొదలుకొని పదునాలుగవ వత్సరమువఱకు (౮౫) మార్లును, పదునాలుగవ వత్సరము మొదలుకొని ముప్పదివత్సరములవఱకు (౮౦) మార్లును నాడి చలించుచుండును.

శతార్ధవత్సరం వ్యాప్య కంపనం పంచసప్తతి,
తతోఽశీతౌ ప్రకథితం షష్టివారం ప్రవేపనమ్. 8

ముప్పది వత్సరములు మొదలుకొని నేఁబదివత్సరములవఱకు (౭౫) మార్లును, ఏఁబదివత్సరములు మొదలుకొని యెనుబది వత్సరములవఱకు(౬౦) మార్లును నాడి చలించుచుండును.

వయోవస్థా క్రమేణైవం క్షీయంతే గతయో ముహుః,
సార్ధద్వయపలేకాలే నాడీనా ముత్తరోత్తరమ్. 9

జన్మప్రభృతి వయోవస్థాక్రమంబుగా నాడుల కంపనము తగ్గుచుండును. అనఁగా వయస్సధికమగుకొలఁదిని నాడీచలనము తక్కువగానుండును.

ఏవం బహువిధా ద్రోగా త్తత్తల్లింగానుబోధినీ,
నాడీనాం చ గతి స్తద్వ ద్భవే త్కాలా త్పృథక్పృథక్.

ఇటుల జన్మప్రభృతి యెనుబదివత్సరములవఱకు నాడులకంపనము యొక్కసంఖ్య వ్యవస్థితమాచునుండ, మధ్యకాలంబున జ్వరాది రోగములు ప్రసక్తియయ్యేనేని, అపుడు రోగజ్ఞానమునకు హేతుభూతంబగు నాడీగత సంఖ్యయు వ్యత్యస్తం బగును.

హృదయస్య బృహద్భాగ స్సంకోచం ప్రాప్యతే యది,
ప్రసారయే త్తదా నాడీం వాయునా రక్తవాహినీమ్. 11

హృత్పిండమందలి ప్రదేశావకాశము వాయుగతి విశేషముచే సంకోచము చెందెనేని, అప్పుడు రక్తవాహిను లగు నాడులను బ్రసరించునటులం జేయును.

నాడీగతి రతి క్షీణా భవే న్మలవిభేదతః,
జీర్ణజ్వరా దల్పరక్తా ద్దుర్బలత్వాచ్చ తాదృశీ. 12
తర్పయ త్యసృజం దేహే వ్యాఘూ తై ర్గతిబంధతః,
చంచలా తేజపుంజాచ దుర్బలా క్షీణదా ధరా. 13

నాడులు వాయుసంచారముద్వారా శరీరమున రక్తము వ్యాపించునటుల జేయుచున్నయవి. ఆరక్తదోషవిశేషమువలన, ఆనాడులకు ప్రతిబద్ధకము గలిగెనేని, అప్పుడు నాడులు చంచలముగను, తేజఃపుంజగతికలవిగను, దుర్బలముగను, క్షీణగతి కలవిగను నడచుచుండును.

## చంచలాగతి నాడీలక్షణము.

రక్తోష్ణే శీఘ్రగా నాడీ జ్వరే చంచలతాభవేత్,

రక్తముచే నుష్ణము జనించెనేని, అప్పుడు నాడి యతివేగముతోఁ గూడి చంచలముగ నడచుచుండును.

## తేజఃపుంజగతి లక్షణము.

జ్వరారంభే తథా వాతే తేజఃపుంజగతి స్సిరా. 14

జ్వరారంభమునను, వాతరోగంబునను నాడి, తేజఃపుంజగతికలదియై నడచుచుండును.

—ః దుర్బల, క్షీణనాడీలక్షణము. ః—

దుర్బలే జ్వరరోగే చ అతిసారే ప్రవాహికే,
దుర్బలా క్షీణదా నాడీ ప్రబలా ప్రాణఘాతికా. 15

దుర్బలరోగము, జ్వరము, అతిసారము, గ్రహణిరోగము వీనియందు నాడి మిగుల దుర్బలముతోఁ గూడియుండును. అట్లుండక ప్రబలంబుగ నుండెనేని ప్రాణఘాతినియగును.

—ః ధీరనాడీ లక్షణము. ః—

బహుకాలగతా రోగా సానాడీ ధీరగామినీ. 16

బహుకాలంబుగ రోగపీడితుఁడుగ నుండెడు వానినాడి ధీర నాడి యనంబడును.

ఇతి నాడ్యుత్పత్తి నాడీస్థానస్వరూప కూర్మా
కృతిస్థూలనాడీ సంఖ్యారోగాది పరిజ్ఞాన సాధ్యా సాధ్య
లక్షణ మృత్యుదినాదినిరూపణ యావద్ద్రవ్యాదిభక్షణా
జన్యయద్రూపగతి తల్లక్షణాంగ్లేయమత
నాడీజ్ఞానం సమాప్తమ్.

ఇట్లు నాడ్యుత్పత్తి, నాడీస్థాన స్వరూపము,
కూర్మాకృతి, స్థూలనాడిసంఖ్య, రోగాదిపరిజ్ఞానము, సాధ్యాసాధ్య
లక్షణము, మృత్యుదినాదినాడీనిరూపణము, ద్రవ్యాదిభక్షణ
నాడీజ్ఞానము, వానిలక్షణము, ఆంగ్లేయమత
నాడీజ్ఞానము ముగిసెను.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1927.

## సంస్కృతగ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అధ్యాత్మరామాయణము, మూలము | ... | 1 | 0 |
| అధ్యాత్మరామాయణము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | ... | 8 | 0 |
| కార్తీకమాహాత్మ్యము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 12 |
| కాశీమాహాత్మ్యము, తెనుగువచనము | ... | 0 | 8 |
| గయామాహాత్మ్యము, తెనుగువచనము | ... | 0 | 6 |
| గరుడపురాణము, సవ్యాఖ్యానాంధ్రతాత్పర్యము | ... | 1 | 8 |
| జగన్నాథమాహాత్మ్యము, తెనుగువచనము | ... | 0 | 2 |
| ధనుర్మాసమాహాత్మ్యము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 2 |
| బాలరామాయణము, సటీక | ... | 0 | 1 |
| పద్మపురాణాంతర్గతమాఘపురాణము, ఆంధ్రతాత్పర్యసహితము. | | 2 | 0 |
| అమావాస్యతర్పణము | ... | 0 | 1 |
| ఆపస్తంబగృహ్యసూత్రములు | ... | 0 | 3 |
| ఆబ్దికమన్త్రములు (యజుర్వేదము), మూలము | ... | 0 | 6 |
| ఆంధ్రద్రావిడసంధ్యావందనము | ... | 0 | 2 |
| ఋగ్వేదదేవతార్చన, బ్రహ్మయజ్ఞము, సస్వరము | ... | 0 | 2 |
| ఋగ్వేదపూర్వప్రయోగాదర్శము | ... | 1 | 8 |
| ఋగ్వేదశ్రాద్ధప్రయోగము, ఆశ్వలాయనము, చిన్నసైజు | ... | 0 | 4 |
| తిథిమంత్రములు (ఆరాధ్యులది) | ... | 0 | 2 |
| దేవతార్చన, చిన్నసైజు | ... | 0 | 1 |
| పంచసూక్తములు, సస్వరము | ... | 0 | 2 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము, సస్వరము | ... | 0 | 12 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము, బ్రహ్మమేధసహితము | ... | 0 | 4 |
| పితృతర్పణము, చిన్నసైజు | ... | 0 | 1 |
| తైత్తిరీయఆరణ్యకోపనిషత్తులు, పితృమేధము, మంత్రపన్నములు సహా, సస్వరము | ... | 3 | 0 |
| యజ్ఞోపవీతధారణవిధి | ... | 0 | 2 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| యజుర్వేదసంధ్యావందనము, మూలము, సస్వరము ... | 0 | 2 |
| డిటో పురుషసూక్త, శ్రీసూక్త, ఆంధ్ర టీకాతాత్పర్యసహితము, చిన్నసైజు ... | 0 | 4 |
| యజుర్వేదసంధ్యావందనభాష్యము ... | 0 | 8 |
| యాజుషపూర్వప్రయోగచంద్రిక, సస్వరము—అనేకవిషయములం జేర్చి యాంధ్రమహాజనసంప్రదాయానుసారముగం బరిష్కరించి ముద్రించియున్నాము. చక్కనిప్రతి ... | 2 | 0 |
| రుద్రము, నమకము, చమకము, సస్వరము, చిన్నసైజు ... | 0 | 2 |
| శ్రీవైష్ణవాహ్నికము ... | 0 | 4 |
| శ్రీవైష్ణవశ్రాద్ధప్రయోగము ... | 0 | 4 |
| వ్రతరత్నాకరము, ప్రథమభాగము ... | 0 | 8 |
| ,, ద్వితీయభాగము ... | 1 | 0 |
| వ్రతచూడామణి, 360 వ్రతములు, మంచికాగితములపై చక్కగముద్రితము ... | 2 | 0 |
| వైశ్యసంధ్యావందనము ... | 0 | 2 |
| సూర్యనమస్కారము, చిన్నసైజు ... | 0 | 1 |
| జలార్గళశాస్త్రము, ఆంధ్ర తాత్పర్యసహితము ... | 0 | 4 |
| జాతకచంద్రిక, గోపాలరత్నాకరము, సాంధ్రతాత్పర్యము ... | 0 | 8 |
| కాలామృతము, సటీక, మేలుప్రతి ... | 1 | 0 |
| బృహజ్జాతకము, ఆంధ్రటీకాతాత్పర్య వివరణసహితము, చక్కనిప్రతి, నూతనముద్రితము ... | 2 | 0 |
| ముహూర్తదర్పణము, సటీక, చక్కనికూర్పు ... | 0 | 12 |
| రెట్టమతశాస్త్రము, తాత్పర్యసహితము ... | 0 | 10 |
| షోడశప్రశ్నరత్నావళి, నెపోలియన్ అనుష్ఠించినప్రశ్న గ్రంథమునకు తెనుఁగు ... | 0 | 3 |
| ఛప్పన్నము, ప్రశ్నశాస్త్రము, ఆంధ్ర తాత్పర్యసహితము ... | 0 | 6 |
| నక్షత్రచూడామణి, చక్కనిప్రతి ... | 0 | 6 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| శ్రీపతి, సాంధ్రతాత్పర్యము ... | 1 | 8 |
| సర్వార్థచింతామణి, మేలుప్రతి ... | 0 | 12 |
| లఘుజాతకము, సాంధ్రతాత్పర్యము ... | 0 | 12 |
| భృగుసూత్రములు ,, ... | 0 | 6 |
| భావార్థచంద్రిక ,, ... | 0 | 8 |
| వృద్ధపరాశరము ,, ... | 0 | 10 |
| కేరళప్రశ్నము ,, ... | 0 | 3 |
| సనత్కుమారగృహవాస్తువు, సాంధ్రతాత్పర్యము ... | 0 | 3 |
| మయవాస్తువు ,, ... | 0 | 3 |
| వాస్తుసర్వస్వము ,, ... | 0 | 4 |
| వనమాల (వర్షఫణీ) ,, ... | 0 | 3 |
| స్వప్నశాస్త్రము ,, ... | 0 | 3 |
| గౌళిశాస్త్రము, తెనుఁగు ... | 0 | 2 |
| సాముద్రికశాస్త్రము, సటీక ... | 0 | 4 |
| అష్టకవర్గు, సాంధ్రతాత్పర్యము, చక్కనిప్రతి ... | 0 | 4 |
| శకునశాస్త్రము (శిఖినరసింహశతకము), తాత్పర్యసహితము. | 0 | 4 |
| సారావళి, సాంధ్రతాత్పర్యము ... | 3 | 0 |
| ఆరూఢరత్నసిద్ధాంజనము ... | 0 | 12 |
| అపరోక్షానుభూతి, సాంధ్రతాత్పర్యము, చిన్నసైజు ... | 0 | 4 |
| ఆనందలహరి, ఆంధ్రతాత్పర్యసహితము ... | 0 | 4 |
| ఆత్మపూజ ,, ... | 0 | 1 |
| ఆత్మవిద్యావిలాసము ,, ... | 0 | 6 |
| ఆత్మానాత్మవివేకము ,, ... | 0 | 4 |
| ఆత్మబోధము, సటీక ... | 0 | 4 |
| ఉత్తరగీతా, సాంధ్రటీకాతాత్పర్యము, చిన్నసైజు ... | 0 | 12 |
| జీవన్ముక్తిప్రకాశిక, విద్యారణ్యస్వామికృతము ... | 2 | 0 |
| నైష్కర్మ్యసిద్ధి, సురేశ్వరాచార్యకృతము, ఆంధ్రటీకాతాత్పర్య సహితము ... | 3 | 8 |

| | | | |
|---|---|---|---|
| | | ప్రతి 1-కి రూ. | అ. |
| పంచదశీప్రకరణము, సవ్యాఖ్యానము | ... | 1 | 4 |
| ,, ఆంధ్రటీకాసహితము | ... | 5 | 0 |
| పంచీకరణము. ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 2 |
| డిటో తెనుగువచనము | ... | 0 | 2 |
| బ్రహ్మసూత్రములు, మూలము, చిన్నసైజు | ... | 0 | 3 |
| బ్రహ్మసూత్రములు, తెనుఁగువచనము, శ్రీశంకరాచార్యులవారిభాష్యము అందరికిని తెలియుట దుర్లభమని తలఁచి చక్కనిశైలిలో అనేక వృత్తులననుసరించి తెనుఁగువ్యాఖ్యానమును ప్రకటించినారము. 2 సంపుటములు | ... | 12 | 0 |
| భగవద్గీతలు, మూలముమాత్రము, చిన్నసైజు | ... | 0 | 4 |
| ,, కాలికోబైండు | ... | 0 | 6 |
| ,, ఆంధ్రతాత్పర్యసహితము, కాలికోబైండు | ... | 1 | 4 |
| ,, ,, చిన్నసైజు | ... | 0 | 8 |
| ,, ఆనిబిసెంటుగారి ఇంగ్లీషుతర్జుమాతో | ... | 0 | 8 |
| రామగీతా, సటీక, చిన్నసైజు | ... | 0 | 6 |
| వివేకచూడామణి, మూలముమాత్రము, పాతప్రతి | ... | 0 | 4 |
| డిటో ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 12 |
| వ్యవహారపంచకము, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 2 |
| వేదాంతస్తోత్రపంచకము, శ్రీశంకరాచార్యకృతము, ఆంధ్రతాత్పర్య సహితము.—ఇందు ఏకశ్లోకి, యతిపంచకము, మనీషాపంచకము ప్రాతఃస్మరణము మొదలైనవి గలవు | ... | 0 | 4 |
| సౌందర్యలహరీ, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | ... | 0 | 4 |
| శాంతివిలాసము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 6 |
| శివగీతా, సాంధ్రతాత్పర్యము, చిన్నసైజు | ... | 0 | 12 |
| వాసుదేవమననము, తెనుఁగువచనము | ... | 0 | 12 |
| హరిమీడేస్తవము, సటీక | ... | 0 | 4 |
| హఠయోగప్రదీపిక ,, | ... | 2 | 8 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.